

గౌరి కుప్పుస్వామి
(మద్రాస్, జూన్ 27)



ఉపద్రష్ట కృష్ణమూర్తి—రచన: వాసంతసమీరము
(హైదరాబాద్, జూన్ 17)



సుసర్ల శివరాం: లలిత సంగీతం
(ఇటీవల విజయవాడనుండి ప్రసారితము)



మాలతీ పద్మనాభరావు
(హైదరాబాద్, జూన్ 17)



సుందరపల్లి సూర్యనారాయణమూర్తి: క్లారినెట్
(విజయవాడ, జూన్ 24)



మరుత్తువకుడి రాజగోపాల అయ్యర్
(మద్రాస్, జూన్ 17)



…సూర్ వి. దొరైస్వామి అయ్యంగార్: వీణ
(బెంగుళూర్, జూన్ 27)



పిల్లల కార్యక్రమము—తెలుగు (ఇటీవల మద్రాస్ కేంద్రమునుండి ప్రసారితము)

వాణి
ప్రతినెలా 7, 22-వ తేదీలలో వెలువడును.
విడిప్రతి వెల 35 నయాపైసలు.
సంవత్సర చందా రూ. 8-40 నయాపైసలు.
సంవత్సరమునకు తక్కువ చందా అంగీకరింపబడదు.
ఇతర వివరములకు:
ఎడిటర్, 'వాణి'
ఆలిండియా రేడియో, మద్రాస్-4.





ALL INDIA RADIO




సంపుటము XV] వాణి 7—6—1962 [సంచిక 2


# ధన్యజీవి - కందుకూరి వీరేశలింగం

'అమరేంద్ర'

"తనదేహము, తనగేహము
తనకాలము, తనధనంబు, తనవిద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుడీ వీరేశలింగకవి జనులారా!"

అనే పద్యం రాజమహేంద్రవరంలో పంతులుగారి స్మృతిచిహ్నంగా నెలకొన్న శిలావిగ్రహం క్రింద ఫలకంమీద కనిపిస్తుంది. సామాన్యంగా కీర్తిశేషులను గురించి ప్రస్తావించేటప్పుడు అతిశయోక్తులు దొర్లుతాయి. కాని ఈ పద్యంలో ప్రతి అక్షరమూ సత్యమని పంతులుగారి జీవితం నిరూపిస్తుంది. సంఘసంస్కరణలో సాహిత్యసేవలో తన సమస్తశక్తులన్నీ జాతికోసం నివేదించిన ధన్యజీవి ఆయన.

శరీరంలో బలంలేదు, ఉబ్బసంతో బాధపడుతూ శుష్కించిపోయిన అర్భకుడు. సామాన్య కుటుంబంలో జన్మించాడు. అర్థబలం అంతంత మాత్రమే. పెద్ద పదవులవల్ల వచ్చే ఆధిక్యం అసలేలేదు. ఒక చిన్న బళ్ళో నెలకి ముప్పది రూపాయల జీతం తెచ్చుకునే తెలుగు పండితుడుగా ఆయన జీవితం ప్రారంభమయింది. కాని ఆయన కార్యదీక్ష, సంకల్పబలం అమోఘమైనవి. చూడటానికి అర్భకుడుగా కనిపించినా గొప్ప కార్యశూరుడు. మిన్ను విరిగి మీదపడినా చలించని మనోబలం ఆయన ఆస్తి. ఒక్కరూ తోడురాక పోయినా ఒంటరిగా ముందుకి సాగిపోగల ఆత్మవిశ్వాసం ఆయనకి ఆలంబనం. అందువల్లనే వీరేశలింగంగారు అసాధారణ వ్యక్తిగా వెలసి ఆంధ్రజాతిని ఉర్రూతలూగించగలిగారు. రాజారామమోహన్‌రాయి ప్రతిపాదించిన ప్రగతిభావాలు, కేశవచంద్రసేన్ ప్రబోధించిన ధార్మిక విశ్వాసాలు, ఈశ్వరచంద్ర విద్యాసాగరుని సంస్కార ప్రణాళికలు వీరేశలింగంగారిని ధర్మవీరునిగా రూపొందించాయి. నైతిక జీవనమే ప్రాతిపదికగా, దీన మానవులకు చేసే సాయమే దీనబంధువైన భగవంతుని



ఆరాధనగా పంతులుగారు భావించారు. "నీలోవున్న చిన్న ప్రపంచాన్ని పవిత్రం చేసుకో. అటుపైన నీ చుట్టూవున్న విశాల విశ్వాన్ని సంస్కరించవచ్చు" అనే సూత్రాన్ని ఆకళించుకుని సాధుజీవనం అలవరుచుకున్నారు.

"నా జీవితమే నా సందేశం" అని చాటుకోగల మహాత్ముల శ్రేణికి చెందిన ఉత్తమ వ్యక్తి ఆయన. ధార్మిక ప్రాతిపదికలు వుండటంవల్లనే ఆయన సంస్కరణ కార్యక్రమం అద్వితీయ శక్తితో కొనసాగి, అఖండ విజయాన్ని సాధించింది. తాత్కాలికావేశాలని రెచ్చగొట్టే చౌకబారు ప్రయోజనాలు ఆయన ఆశించలేదు. మూర్ఖాచారాల వల్లనూ, అంధవిశ్వాసాల వల్లనూ అణగారిపోతున్న మానవాత్మని, సత్యాన్వేషణని, వివేచనాశక్తిని, తార్కికబలాన్ని పునరుద్ధరించాలనే ఉన్నత లక్ష్యంతో పంతులుగారు ఉద్యమాలు నడిపించారు.

పత్రికలు నడిపినా, సమాజాలు నెలకొలిపినా, సేవాసంస్థలు నిర్వహించినా ఆయనలక్ష్యం ఒకటే.

స్వార్థరహితంగా మానవజాతికి సేవచేయటమే ఆదర్శం. తను సత్యమని

---

## ఈ సంచికలో

ముఖచిత్రం: ముట్నూరి కృష్ణారావు (వీరినిగురించిన ప్రసంగం జూన్ 23-వ తేదీ రాత్రి 7-30 గంటలకు విజయవాడ కేంద్రమునుండి వినవచ్చును.)

చిత్రకారుడు: హెచ్. వి. రామ్‌గోపాల్

నమ్మినదాన్ని ఎవరికి ఇష్టం వున్నా లేకపోయినా నిస్సంకోచముగా ప్రకటించటం, తను నిజమని నమ్మినదాన్ని జీవితంలో అనుష్ఠించటం వీరేశలింగంగారికి పుట్టుకతోనే అబ్బిన గుణాలు. లోకమంతా శత్రురూపంతో ఎదురు నిలిచినా తన విశ్వాసంకోసం ప్రాణం ఇవ్వటానికి వెనుదీయని సాహసం ఆయనకి వెన్నతో పెట్టిన విద్య. తనమీద లోకం రాళ్ల రువ్వినా, తను లోకంమీద పూలు జల్లాలని ఆయన ఉద్దేశం. ఈ ధైర్యసాహసాలు చిన్న విషయాలు మొదలుకొని అన్నిటిలోనూ వెల్లడి అయేవి. ఆయన మూఢవిశ్వాసాలకి ప్రబల విరోధి. నక్షత్ర దోషాలన్నా, వర్జ్యాలన్నా ఆయనకి నమ్మకం లేదు. ఈశ్వరుడు సృష్టించిన రోజులు అన్నీ మంచివే అని ఆయన వాదం. మొదటిసారి ఉద్యోగం వచ్చినప్పుడు అమావాస్యనాడు పనిలో చేరారు. ఒకసారి చెట్టుమధ్య నుంచి అరిటిగెల వేసింది. అది కీడుని సూచిస్తుందనీ చెట్టును నరికించవలసిందనీ చుట్టాలు ఒత్తిడి చేశారు. అరిష్టాలకీ అరిటిగెలకీ సంబంధమేమిటి? గెల పెద్దది అయేదాకావుంచి, కాయలు తరిగి కూరవండించి, తిని ఏ అరిష్టమూ రాలేదని ఋజువు చేశారు. ఇంట్లో దూలానికి తేనె పట్టు పట్టిందట. బంధువు లంతా శాంతి కర్మలు చేయించాలన్నారు. ఆయన ఒప్పుకోలేదు. భూతవైద్యుల మోసాలు బైటపెట్టాలని ఆయన ఒంటరిగా అర్ధరాత్రి వేళ స్మశానంలో భూతప్రేత పిశాచాలను తన కళ్ళతో చూడాలని సంచరించేవారు. ఆయన కళ్ళకి ఒక్కదయ్యమూ కనబడక పోయేసరికీ భూతవైద్యులనీ, మాంత్రికులనీ మోసగాళ్ళుగా పరిగణించి ఎదుర్కొనటం మొదలు పెట్టారు.

## వివేకవర్ధని

ఆ కాలంలో మద్రాసునుంచి కొక్కొండ వెంకటరత్నం పంతులు ఆంధ్రభాషా సంజీవని అనే పత్రికద్వారా స్త్రీలకి విద్య పనికి రాదనీ, అది లోక నాశనహేతువనీ ప్రచారం చేస్తూ ఉండేవాడు. విజ్ఞాన సంపాదనకి స్త్రీ పురుషులకి సమానాధికారం వుండాలని వీరేశలింగంగారి విశ్వాసం. చందాలు వేయించి, కాలప్రవాహానికి ఎదురీదుతూ, బాలికా పాఠశాలని ధవళేశ్వరంలో స్థాపించారు. సంఘదురాచార నిర్మూలనకోసం, స్త్రీ విద్యావ్యాప్తికోసం ప్రబల సాధనంగా వినియోగించే "వివేకవర్ధని" అనే మాసపత్రికని నెలకొలిపారు. దానికి అనుబంధంగా "హాస్య సంజీవని" అనే పత్రికను ప్రారంభించి సనాతనుల మూఢ విశ్వాసాలనీ, సంఘాభ్యుదయ నిరోధకులనీ నవ్వులపాలుచేశారు. ఆ కాలంలో అధికారులు లంచాలు పుచ్చుకుని ధర్మవిరుద్ధంగా ప్రవర్తించేవారు. వేశ్యాలోలురైన పెద్దలు సంఘంలో గౌరవనీయులుగా చెలామణీ అయేవారు. వివాహ సందర్భాలలో వేశ్యల చేత మేళాలు ఏర్పాటుచేయించి ఈ పెద్దలు కట్నాలు చదివించటంలో ఒకరితో ఒకరు పోటీ పడేవారు. ఇటువంటి పెద్ద లందరినీ నిస్సంకోచంగా నిర్భయంగా విమర్శించి సమాజాన్ని సన్మార్గంలో నడిపించటానికి తన శక్తు

(తరువాయి 50-వ పుటలో)

# శుభకృత్

[ఉగాది కవిసమ్మేళనము]

చివురుఁజేతుల రాగంబు చిలకరించు
సిగ్గుమెయి మోమువంచి హసించుచున్న
పుష్పవతి మాధవీలత ముద్దుగొనుచు
వచ్చు శుభకృత్తు శుభముల తెచ్చుగాక.

సామి నిర్గత బాలభాస్కరుని తోడ
వెడలివచ్చిన శుభకృత్తు విభునకదిగొ
నింబ మిన్నంది పూలపందిళుల నెఱపె
రంభ ముదమంది తోరణరాజి గూర్చె

మధురతౌర్యత్రికమును బంభరపికాళి
గూర్ప మంత్రాలు పఠియించె గొమరుచిలుక
కుసుమకాంతలు పసపు కుంకుమలు పూసి
పెండ్లి కొమరుని జేసిరి పేరటముల

శుభవసంతము జిలికె గింశుకవధూటి
మావిదొర పాద్యమారంద మధువు నొసగె
ప్రకృతి మంగళ వేదికపైని నిల్చి
మొగ్గముత్యాలు శిరమున పోసె మల్లె.

అల మహాకాలవిభుడు సృష్ట్యాదినుండి
విశ్వసంపద వహియించు నశ్వములుగ
నవని నియమించె ప్రభవాది హాయనముల
గడనుద్రొక్కుత శుభకృత్తు కుదుపులేక.

## వసంతాగమం

అల యశోకపు చిగురుకొమ్మలను దాగి
విచికిల సుమాధరముగ నవ్వెడు లతా వ
ధూటి గురువకనామను తొంగి చూచు
పుష్పబాణుని అచ్చరల్ పొంచికనిరి.

మాటిమాటికి వెన్నంటు మలయపవను
మార్గమున గుంపులగుచున్న మధుపపంక్తి
నలినముఖి సన్నిధాన వినర్తనముల
అలకలై మించె పద్మినీ లలన కపుడు.

చలిత లలితాలకముగ కాంతల మొగాల
పొడము శ్రమవారికణముల తడికొలంచి
విస్ఫుట త్పద్మమగునట్లు వీచికాళి
కదిపె సరసుల వాసంత గంధవహుడు.

ప్రాణసఖిగూడి కుసుమైక పాత్రమందు
మధువుపారణ చేసె బంభర వరుండు
స్పర్శసుఖమున రెప్పలు వ్రాల్చు మృగిని
శృంగమున గీరె కృష్ణసారంగ విభుడు.

బాల శశి వక్రములు రక్త వర్ణములును
నైన కింశుక కుట్మలశ్రేణి యలరె
తక్షణవసంత సంగతి చైత్రిణపంక్తి
క్రాలు నార్రార్ద్రములు నఖక్షతములట్లు.

పల్లవోద్గమ మంజుల పత్రవితతిఁ
జూతబాణ వినిర్మితి సొబగు మిగియ
రతి మనోనాథు నామాక్షరములు గాగ
పట్పదంబుల నునిచె వసంత శిల్పి।

స్తబ్ధ బుద్ధులు వెనుకాడ జాణ లెల్ల
ముందు ముందంజ వేయుచు మురియురీతి
ఎండుమ్రాకులలో గొన్ని యిగురుపెట్టి
హర్ష మొదవించె నల వసంతాగమమున.

కాలవశమున చివురాకు కలిమిదొలగి
బీరువోయిన చందన ధీరు నవ్వె
తలను పైకెత్తి నాలుగాకుల బడాయి
తనదు దినమొల నెఱుగని తాటిచెట్టు.

## కోకిల రసాలవము

ఓయి రసాల నీ కిసలయోత్కర పాటల దీప్తి రేఖలన్
మాయగనీక, నీ కుసుమమంజరు లొందొకటిన్ స్పృశింపగా
జేయక, పుప్పొడుల్ మధువు జిందనీయక నొండురెండు కొ
షాయదళమ్ములన్ మెసవి సాగెద ముందు కనుగ్రహింపవే.

అతిథి సపర్యభారత మహావని గేస్తుల కార్షధర్మ సం
గతమను దొడ్డబుద్ధి నను గాలిడనిచ్చిన నీ దళంబు లా
మెతగ భుజించి నీదయిన మేలుస్మరించెద, నీయశంబు ది
క్తతినలమంగ కోటిగుణితంబుగ బాడెద బంచమశ్రుతిన్.

ప్రసవభరాలస స్తబక పంక్తులు త్రొక్కి పరాగ సంపదల్
పసిచెడ మేనురాచి సుమసారమరంద మబిందుకమ్ముగా
గొనదుచు ద్రాగు బంభరము కూలికి దీసెడు కూనిరాగముల్
పొసగ యశంబు నీకిడీ యపూర్వకళాకలనంబు గూర్చునే?

(తరువాయి 48-వ పుటలో)



# మా అవ్వతో వేగలేం

## తిరునాళ్లలో తప్పిపోయింది

దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

మా అవ్వ నెరగరూ మీరూ, అవ్వని? హయ్యో! సుబ్బమ్మవ్వని? మావూళ్లో ఆవిణ్ణి యెరుగనివాళ్లు లేరే! అసలు వూరంతా అవ్వనే పిలుస్తారావిణ్ణి. కొద్దిమంది 'సుబ్బమ్మవ్వగారూ' అని కూడా అంటారు. ఆవిడికి కోపం వొచ్చినప్పుడు, 'ఆఁ! ఆఁ! ఆఁ! ఎవర్రా అవ్వ! నువ్వు నా కేమవుతావురా? చస్తే దెయ్యమవుతావుగాని!'' అని గద్దిస్తుంది; అప్పుడు చటుక్కున సర్దుకుని ''సుబ్బమ్మగారు'' అంటారు. వొక్కొక్కప్పుడు, 'సుబ్బమ్మగారూ' అని పిలిస్తే, 'హారిగాడిదా! వేలెడంతలేవు, బొడ్డుకోసి పేరెడతావురా నాకు!'' అని దులిపేస్తుంది. వెంటనే దిద్దుకొని ''అవ్వగారూ!'' అంటారు.

ఏఁవయితేనేం. ఆవిడంటే అందరికీ యిష్టఁవే. అవ్వంటే.

అవును అందరికీ యిష్టఁవే మరి! వాళ్లకేంపోయింది, యిష్టం కాక! యెప్పుడో కనిపిస్తుంది వాళ్లకి: కనిపించినప్పుడు యంచక్కా కుశల ప్రశ్నలూ అవీ వేస్తుంది; సావేఁతల్తో సాతాళించి కబుర్లూ కథలూ చెప్తుంది; మాంచి ఫారమ్‌లో వుంటే, అంటే వొడుపుగా వుంటే, పాటలు పాడుతుంది, పాఁవుపాటా అవీ. ఆ కాస్సేపూ వాళ్ళకి కులాసాగా వుంటుంది. వింటారు. పోతారు. వాళ్లకేం హమేషా ఆవిడితో యింట్లో వుండే వాళ్ళం, మేం వేగలేక చస్తున్నాంగాని!

అన్నట్టు—అవ్వంటే మీ రెరగరన్నారు కదూ. సుబ్బమ్మవ్వ ఆవిడ మమ్మల్నెలా యేడిపిస్తుందో చెప్పే ముందు ఆవిడ రూపురేఖలూ ధోరణీ మీకు తెలియద్దూ! మా అవ్వంటే, సుబ్బమ్మవ్వ, మా నాన్నగారి మేనత్త. ఆయన్తాలూకు అయిదెకరాల పొలఁవూ అప్పారం లోగిలీ వగైరా ఆస్తితో అవ్వకూడా నాకు సంక్రమించింది. మా నాన్న మేనత్తంటే దాదాపు డబ్బయేళ్ళపై మాటగదా! అయితేఁనేం నిటార్గా కదురులా నిలబెడుతుంది. యిష్టంలేనప్పుడుమాత్రం తెలుగులో 'ఐ' అక్షరంలేదూ, 'ఐ'—దానిలాగ వొంగిపోతుంది తరుచు కంఠం రైలు గంటలాగ గణగణా పలికిస్తుంది; యిష్టంలేనప్పుడు పీలగా మూలుగుతుంది. ఈ మధ్య కొంచెం చెడ్డా గెద్ద చూపులాంటిది అవ్వచూపు. అయితే పళ్లమాత్రం తీయించెయ్యడమో రాలిపోవడఁవో జరిగింది. వొక్కటేవొక్క పైపన్నుమాత్రం. ముందుది కింది పెదవి మీదికి వొంగి అక్కడ కాలూదిమాట్లాడుతున్నప్పుడు రవ్వంత తలాడిస్తూ వుంటుంది అది అందానిక్కాటోలు వుంచేసిందవ్వ. సుబ్బమ్మవ్వ. మాయింటికొచ్చిన వో పెద్ద మనిషి—అప్పన్న శాస్తుర్లని మాంచి కవిగూడా—ఆయనొక సారన్నాడూ చమత్కారంగా ''ప్రపంచంలో యే ప్రభుత్వఁవూ చెయ్యలేనిపని సుబ్బమ్మవ్వగారు చేసిందండీ! వొకేవొక్కటి తప్ప యేపన్నూ లేకుండా చేసింది!'' అని. అయితే, అవ్వ మాట్లాడుతుంటే మాత్రం అతి స్పష్టంగా తెలుస్తుంది.

కొందరు పళ్లులేనివాళ్ళ నోరు లక్కపిడతలాగ డొల్లిగా వుంటుంది; మాట్లాడుతుంటే యేఁవీ తెలీదు. రొచ్చులో నడుస్తున్నట్లు పుసుకూ పుసుకూ గాలిపోసుకుంటుంది, అంతే; పాత రబ్బరు బొమ్మ కడుపు నొక్కితే చప్పుడైనట్లు. అవ్వలాగాదు.

అయినా వో లోపంవుంది అవ్వ మాటల్లో 'ప' 'ఫ' అని పలుకుతుంది. 'తప్ఫూ, పప్ఫూ, చెప్ఫూ' అంటుంది- ఆ వొంటిపన్నువల్ల.

అసలు అవ్వదీ, సుబ్బమ్మవ్వదీ పెద్ద జాతీయ నాయకుడి వుపన్యాస ధోరణి. అయితే అవ్వ తెలివిగా మాట్లాడుతుంది. వోసారి, వుపన్యాసాల్తో దేశాన్నంతనీ తలదిమ్మెక్కించే వో పెద్దమనిషి మాయింటికొచ్చాడు. ఆయన సభలోనేగాక సభ యివతల కూడా సభలో అంతా మాట్లాడతాడు. మా యింటికొచ్చిన పదినిమిషాల్లో మొదలెట్టాడు ప్రసంగం. మరి పది నిమిషాల్లో అవ్వ కలగజేసుకుని రంగస్థలంలో విరగబడింది. ఆ నాయకుడుగారు తోకజాడించి, నాటికీ నేటికీ అవ్వకి 'నమస్తే'. అంతే! ఆవిడ సన్నిధానంలో నోరువిప్పడు.

వెనకటికి వోకవిగాడు చెప్పినట్లు ''నిప్పుల, నీళ్ళను, చప్పిడుప్పిళ్ళను, తీర్థాల, తిరునాళ్ళ త్రిప్పటలను'' గడిదేరి గడ్డకట్టిన ఘటం అవ్వ. పెళ్ళికి కొత్త ముందో వెనకో పోయాడు పెనిఁవిటి. డబ్భైయేళ్ళపైని యేకధాటీగా అంటే యేకటాకీని వైధవ్య రాజ్యాన్ని పరిపాలించి పారేసిన రాణీ బహద్దర్. గడ్డు బ్రహ్మచారిణి. యాక్సిడెంట్, అంటే ఏ కారో రైలో కలగపేసుకుంటే తప్ప మార్కండేయాది చిరంజీవుల లిస్టులో మనిషి, మా అవ్వ, సుబ్బమ్మవ్వ.

నాలుగ్గంటలకే లేచి తొలికోడిని లేపడం, తలుపులన్నీ తెరిచిపారేసి పాచిపనులూ అవీ చెయ్యడం, చెంబులూ గిన్నెలూ చప్పుళ్లుచెయ్యడం, స్నానం చెయ్యడం, వత్తిరాట్నంలాంటి కంఠఁవెత్తి 'ప్రాత స్మరామి' వగైరా శ్లోకాలు చదవడం, మానిద్దర తగలెయ్యడం—ఇలాగ రోజంతా జరిగే తంతునుగూర్చి అట్టే చెప్పడం నా కిష్టంలేదు. ఈ వివరాలుకూడా మీకు చెప్పకపోదును. కాని మీకోసఁవే చెప్పా ఇదంతా. అవ్వ ధోరణిలో చెప్పవలసివొస్తే యెప్పుడైనా అవ్వ యెదురయితే చప్పున తప్పుకుని దాటిపోవచ్చని మీరు! అంతేగాక, ఇవన్నీ చెప్తేగాని. మేఁవావిడితో యెలా వేగిపోతున్నాఁవో మీకు తెలీదనిగూడా యిన్ని వివరాలిచ్చా మీకు. యింట్లో మమ్మల్ని ప్రతిఘడియా యేడిపించే పనుల్నిగూర్చి నేను చెప్పనేలేదు. హయ్యో, బాబో! యేఁవవ్వండీ బాబూ! కోటయ్యగారు క్లీన్గా భోంచేసిన విస్తట్లోనే కొత్తదసుకున్నానని, మా శాషమ్మ దొడ్డమ్మకి మళ్ళీ వొడ్డించడం, నీళ్ళనుకొని చెంబుడు చామర్ల కోట పప్పునూనితో చెయ్యకడుక్కోవడం, యెంగిలి విస్తళ్ళన్నీ కట్టగట్టి గోడమీదనుంచి వీధంట వెడ్తున్న మేస్త్రీటు వీర్రాజుగారి తలమీద పడేటట్టు విసిరివేయడం, గోవిందరావుగారి చేతిమీద వేడి పులుసు వొడ్డించాలని వొడ్డించడం—యీ గొడవలన్నీ ముందు ముందు మీకు తెలుస్తాయి. అలాగే సినీమాకు వెళ్ళడం, సర్కస్ వాళ్ళ బోనులదగ్గిర కదలకుండా నిలబడి అక్కడ జంతువుల్తో జెతకట్టడం శాసనసభ సీటుకోసం మా వూళ్ళో చేసిన పెద్ద యెన్నికల సభలో! రభస చెయ్యడం—యిలాంటివన్నీ కూడా యిప్పుడుకాదు, తర్వాత చెప్తా.

అయితే వో చిన్న సంగతిచెప్పి- అది చెప్పితీరాలి--ఆవిడ తిర్నాళ్లలో తప్పిపోవడం దగ్గిరకొస్తా.

అప్పన్న శాస్తుర్లుగారని చెప్పానే ఇందాకా, కవిగారు, ఆయన వోసారి అవ్వమీద పంచరత్నాలు చెప్పాడు భోజనాలదగ్గిర—సరదాకి!

''సుగుణమణి గణ నికురుంబ
సుబ్బమాంబ''

అనిన్నీ.

''సుజన సేవావలంబ గం.
సుబ్బమాంబ''

అనిన్నీ.

"గం." అంటే గంగాభాగరథీ సమానురాలనిట.

ఆయన పద్యాలు చెప్తుంటే, అవ్వ ముసిముసినవ్వుల్తో అటూ ఇటూ తిరుగుతూ, ఏదో తనగొడవ కాదన్నట్టు నిర్లక్ష్యంగా పట్టించుకోనట్లూ, విననట్లూ అంతావిని, "అవి వో కాయితం మీద రాసిపారెయ్యండి బాబూ, మా నాన్నిగాడికివ్వండి" అంది.

నాన్నిగాడంటే మా పెద్దబ్బాయి, వాడంటే మా అవ్వకిష్టం. మా నాన్న పేరని; వాడూ గడుసురాస్కెల్ యేం చేశాడూ, ఆ పద్యాలు తీసుకుని, వల్లించి, అడపా తడపా పెద్ద రాగవరసపెట్టి అవ్వదగ్గిర చదవడఁవూ, ఆవిడదగ్గరేదేనా కొట్టేయడఁవూ. ఈ పద్యాల వెర్రి అవ్వను ఎంతదాకా పట్టుకుందీ, అంటే, వోసారి నాతో అందీ—"వోరే అబ్బాయీ! నేను పోయాక పదకొండోరోజున యీ కవుల్నందర్నీ పిలిపించి నామీద పద్యాలు చెప్పించరా" అని

ప్రస్తుత మేఁవిటంటే, నాన్నిగాడు శివరాత్రి తీర్థాని కెళ్దాఁవని అవ్వని రెచ్చగొట్టాడు. నాకిష్టంలేదు. "తీర్థములు మానసములు ముక్తిప్రదములు" అంటూ "సత్యము తీర్థము" అంటూ కవిచెప్పిన మాటల్లో నమ్మకఁ వున్నవాణ్ణాయెను. అయితే యేం చెయ్యను? అవ్వా న్నాన్నిగాళ్ళల్లో యే ఒక్కళ్ళనీ లొంగదీయడఁవే కష్టం; ఇద్దరూ పట్టుకున్నారాయె!! పోనీ యిల్లేనా ఆనాటికి విశ్రాంతిగా ఉంటుందనిన్నీ దారిపొడుగునా అస్తమానఁవూ అవ్వకోసం పంచరత్నాలు పద్యాలు చదివి నాన్నిగాడి తెగులు కుదురుతుందనిన్నీ,

ఆ తీర్థానికేవెళ్తున్న రావఁయ్యకాపుని బతిమాలుకొని, అతని రెండెడ్ల బండిలో మావాళ్ళనీ కుక్కాను. తోవలో అవ్వ కునికిపాట్లుపడి కింద పడకుండా రాఁవయ్యకాపు పెద్దకొడుకుని బండిచివర బిరడాలాగ బిగించాను. ఈ బిరడా సంగతికూడాతర్వాత చెప్తా.

వాళ్ళు తెల్లారగట్లేవెళ్లారు. సాయంకాలఁవో, రాత్రివడుతూంటేనో రావాలి మూడు నాలుగ్గంటలకి యేదో పనివుండి వీథులోకి వచ్చా. వీథరుగు పక్కని బిక్కమొహం వేసుకుని, యేడిచి యేడిచి వాచిన యెర్రకళ్ళువాడూ నాన్నిగాడు వొదిగి నిలబడివున్నాడు.

"ఏమిరా? అవ్వేదిరా??" అన్నాను.

"త-త త-" అన్నాడు.

"ఏమిట్రా త త-త? తప్పిపోయిందా? చ చ చ కాదుగదా అంటే చచ్చిపోలేదుగదా" అనడిగాను.

"తీర్థంలో అవ్వ కనబళ్ళేదు" అన్నాడు వాడు మెల్లిగా.

"ఆఁ!?" అన్నాను. నా గుండె గుభేలుమంది. గోదార్లో పడిందేఁవో! కారుకింద పడిందేఁవో! గుండె ఆగిపోయిందేమో, ముసల్దీ; నాకు మహ జాలీ, దుఃఖం వేసుకొచ్చాయి. అసలు అవ్వంటే మా అందరికీ ఎంత యిష్టఁవో అప్పుడు తెలిసొచ్చింది నాకు. అవ్వని విడదీస్తే లోకం ఎలా వుంటుందో మాకు తెలియదు. పాపం ఆవిడ కెవరున్నారు? నిజానికి నాకు ముసలాళ్లన్నా స్తే ఎంతో దిగులు. ముందుకు చూసుకుంటే నోరుతెరుచుకుని దగ్గరగా వొచ్చే చీకటి భూతం కేఁవుంది!

మా అవ్వ చూపులు వొక్కొక్కప్పుడు, దూరాన ఆకాశాన పోయే పక్షుల్లాగా వుంటూంటాయి. యెక్కడికో యెక్కడికో పోతూన్నట్లు. అప్పుడు నాకు భయంవేస్తుంది. అవ్వ వొక్కొక్కప్పుడు పొడుగ్గా నిట్టూర్చేది; ఆ నిట్టూర్పు చిన్నతనం నుంచీ యెనభై యేళ్ళ దార్లోపడి పాకివచ్చినట్టుండేది. ఇప్పుడు యీ మాటలన్నీ స్తిమితంగా అంటున్నానుగానీ అప్పుడు,

"యేఁవిట్రా, యేం జరిగిందీ?" అని నాన్నిగాణ్ణి అడిగాను.

గోదావర్లో స్నానం చేసొచ్చారట. గుళ్ళోకూడా వెళ్లొచ్చారట. స్వామి దర్శనఁవయ్యాక, గుళ్ళో మండపం మీద కూర్చుని వాడిచేత సరదాగా పంచరత్నాలుగూడా చదివించుకుందిట. తర్వాత యివతలికి వచ్చాక, రంగులరాట్నందగ్గిర కొచ్చేప్పటికి నాన్నిగాడు ఆ దెక్కుతానన్నాడట. వాడు కాస్సేపు దానిమీద తిరిగొచ్చేసరికి అవ్వక్కడ లేదు. వాడు మొదట యిక్కడా అక్కడా చూశి, కనబడకపోతే కంగారుపడి, "అవ్వా, అవ్వా" అని పిలుస్తూ తీర్థఁవంతా తిరిగి, బళ్ళువిప్పినచోటు దగ్గిరికొచ్చి, అక్కడకూడా ఆవిడ కనబడకపోతే అయిదుమైళ్లూ నడిచి యింటికొచ్చేశాడు. ఇదీ కథ,

వెంటనే రావయ్య కాపొచ్చాడేమో-వాళ్ళింటికి కబురు చేశాను. రాఁవిగాణ్ణీ గోవిందునీ తిర్నాళ్ళకి పరిగెత్తించాను, అవసరమైతే పోలీసుతోగూడా చెప్పమన్నా. ఇంట్లో మా ఆవిడ పిల్లలూ నిశ్శబ్దంగా కూచున్నారు, కుక్కిన పేనుల్లా. నేను శివస్మరణ చేస్తూ బయటికెళ్తూ, లోపలికొస్తూ మతిపోయినట్లు తిరగడం మొదలెట్టాను!

రాత్రి పదయింది. అవ్వలేకుండా రాఁవయ్యకాపు బండి ఒచ్చేసిందిట' రాఁవిగాడూ గోవిందూ వట్టిచేతుల్తో, అంటే అవ్వలేకుండా ఒచ్చేశారు, ఇహ వూరుకోగూడదని, మా ఆవిడ లోపల్నించి కొంచెం కూనిరాగం యేడుపు ప్రారంభించింది. చంటి





పిల్లాడుకూడా యథాశక్తి వాళ్ళమ్మకి తోడయ్యాడు. చూడ్డానికీ ఉబుసు పోకా పొహంగ్రామం మా ఇంటి దగ్గిరచేరి, అవకాశం రాగానే సరదాగా పరామర్శలోనూ అవ్వ దివ్య వ్యక్తుల్ని 'నెవ'రు వేసుకోడం లోనూ అప్పుడే పడిపోయారు.

ఇదీ తిరునాళ్ళరోజున అర్థరాత్రి మా స్థితి.

అంతలో "సన్యాసి రాజుగా రిల్లి దేనాః" అని దూరాన్నుంచి గద్దిస్తూన్న మాటలువినబడ్డాయి: అందరూ అటుతిరిగి చూశారు:

"యెవరు బాబూ యేఁవిటిః" అని గావుకేకపెట్టాను నేను. చీకట్లోంచి వొస్తూపోలీసుజెవానుకనబడ్డాడు.కూడా టీగ్గా నడుస్తూ, చీకట్లో దీపస్తంభం లాగా జెవానుకంటె ధాటీగా అవ్వ సాక్షాత్కరించింది: "అవ్వొచ్చింది"అని కేకేశాను: లోపల్నించి అందరూ "వొల్లో"మని యివతలికి వొచ్చారు:

కొందరుమాత్రం అవ్వ అప్పుడే దొరికేసిందే, నాల్రోజులపాటు సరదా పోయిందే" అని దిగులుమొహం వేశారు.

పోలీసు జెవాన్, "యిదుగోనండీ ముసిలావిడ. నా ప్రాణాలు తోడేసింది: యీవిణ్ణి తిర్నాళ్ళకీ తీర్థాలకూ పంపి, దేశంమీద వొదుల్తారేఁవిటయ్యాః యీవిడకంటె మా సూపరెంటు నయం"అని చీదరించుకుంటూ అన్నాడు:

"పోరా: నే సూపరింటునే,నాకేంరా బహద్దర్ని. కెలవిచ్చాను, పో"అంది అవ్వ. వాడు పళ్లు బిగించి కొరకొర చూచి, చీకట్లోకి నడిచి, అక్కడ ఖాండ్రించి వుమ్మేశి చక్కాపోయాడు:

ఇహ తీర్థంలో జరిగిన కథేవిఁటంటే——

నాన్నిగాడు రంగులరాట్నం తిరుగుతూంటే పిల్లలందరికీ జీళ్లూ, జంగిడీ మిఠాయీ, తొక్కుడుండలూ కొందామని, ఆ కొట్లకెళ్ళి వొక్కొక్కళ్ళకీ పేరు పేర్నా వొక్కొక్క పొట్లాం కట్టించిందిట. అక్కడ చిల్లరవిషయంలో కొట్టువాడితో పేచీ వొచ్చి, వాణ్ణిభూశయనం చేసిపారేసి,దమ్మిడీలతో సహా వాడిదగ్గర్నుంచి రాబట్టి, పాత్ర సాఁవాను దుకాణంవైపు దండయాత్ర మళ్లించి, అక్కడ ఆ దుకాణంమీద పడిందట: అక్కడ రాగిచెంబూ గరిటా బేరం తేల్చడానికి రాఁవరావణ యుద్ధంచేసి, రాచ్చిప్పల కొట్టువైపు దృష్టితిప్పి, అటు దాడి చేసింది: దారిలో దక్కీ ఢమఢమల బండీవాడు తారసిల్లితే అన్నీ వాయించి నడిపి చూసి, అమ్మేవాడు బాబుమని యేడ్చేదాకా వాణ్ణి ఆపి, అంతలో పుష్కరయ్యగారికుటుంబం కనబడితే వాళ్ళతో పూసులాడి అట్టే నాలుగడుగులేసేసరికి నాన్నిగాడుజ్ఞాపకొచ్చాడు. అప్పటికప్పుడే పొద్దువాల్తోంది:

"నాన్నిగా నాన్నిగా" అని తీర్థఁవంతా తిరగడం మొదలెట్టింది: బళ్ళదగ్గిరికొచ్చి చూస్తే, రాఁవయ్యకాపు బండీ వెళ్ళిపోయింది: మళ్ళీ తీర్థంలోకి వొచ్చింది: "మా నాన్నిగాడు కనబడ్డాడాః" అనడుగుతూ: ఎవళ్ళనడిగినావాళ్ల పట్టించుకోలేదు: అప్పటికి కంగారుపడ్డం మొదలెట్టిందవ్వ. ఇంతలో కనబడిన పోలీస్ జెవాన్ని కూడా అడిగింది: వాడు వూరూపేరూ అన్నీ అడిగి పోలీస్ స్టేషన్‌దగ్గిర కూచోబెట్టాడు:

"అమ్మా: భైపడకండి, ఇంటికి తీసికెడతాం" అని పోలీసువాడంటే, "ఎవడికిరా భయంః" అని ధీమాగా మొదట అన్నప్పటికీ, నాన్నిగాడి కోసం లోపల్లోపల కంగారుపడిపోయింది అవ్వ: ఆవిడ పోలీస్ స్టేషన్లో కూచున్నసమయంలోనే,కాఁవిగాడూ గోవిందూ ఆఁవెకోసంగాలించి పోయారు: యిదంతా చెప్పాక యిలాగంది అవ్వ: "ఆ రాచిప్పలదుకాణం దగ్గిరాలస్యఁవయి పోయిందర్రా, అక్కడే వొళ్లుమరిచిపోతూంటాను: ఏమిరా నాన్నిగా, శివరాత్రిగూడాను. అప్పన్నశాస్త్రుర్లుగారి పద్యాలు నామీద రాసినవి చదవరా" అంది: అందరూ పకపకా నవ్వారు: నాకుమాత్రం చిర్రెత్తుకొచ్చింది: ఆవిడ గొంతుక పట్టుకుని అరాత్రి ఆఁవెని శివసాయుజ్యం పొందిద్దాఁవనుకున్నాను: దిక్కుమాలిన పాపభయవో, దండనభయంఁవో వొచ్చిపడి మళ్ళీ తఁవాయించుకున్నాను: అంతకంటె గూడా లోపల పిచ్చియిష్టంగూడా యేడిపిందాయెను అవ్వమీద,సుబ్బమ్మవ్వమీద:



# ఒకే కథ - నన్నయ్య, తిక్కన ఎట్లా చెప్పారు?

కె. లక్ష్మీరంజనం

నన్నయ-తిక్కనల కవిత్వపు కళను గూర్చి భిన్నాభిప్రాయాలు విద్వాంసుల్లో వినిపిస్తూ ఉంటాయి. వారిద్దరూ రచనచేసిన ఒకే కథను పోల్చిచూస్తే వారి కళాధర్మము అందలి తారతమ్యం కొంత గోచరింపవచ్చును. భారతమునందలి కథలు రెండు మాత్రం గోచరిస్తున్నాయి. ఒకటి గరుత్మంతుని వృత్తాంతము. మరొకటి ఉదంకుని వృత్తాంతము. ప్రస్తుతము వీనిలో గరుత్మంతుని వృత్తాంతమును గూర్చి ప్రసంగించుకుందాము. ఆది పర్వము ద్వితీయాశ్వాసములో నన్నయయు, ఆనుశాసనిక పర్వ ప్రథమాశ్వాసములో తిక్కన సోమయాజియు కథను వ్రాశారు. ఆయా ఘట్టాల్లో సౌపర్ణోపాఖ్యానానికి కలిగినప్రసక్తిని బటి కథను పోషించడంలో వారవలంబించిన భిన్న మార్గాలు ఏర్పడి ఉంటాయని తోస్తుంది. ఆదిపర్వంలో ఈ కథ, కద్రూ వినతల వృత్తాంతంలో భాగంగా వచ్చింది. శౌనకాది మహామునులు సూతునిట్లడిగారు.

ఒరులవలనఁ బుట్టు
నోరిమియును నెగ్గుఁ
బొరయకుండ సరసి పుత్రవరులఁ
దగిలి కాచునట్టి తల్లి సర్పములకు
నేలయలిగి శాపమిచ్చెనయ్య.

అని. కద్రూశాప సందర్భముగా గరుత్మంతుని కథ ఉపన్యసింపబడింది. అనుశాసనికపర్వంలో మరొకలాగ ఈ కథ ప్రసక్తమైంది. ధర్మరాజు భీష్మునితో అన్నాడు. గరుత్మంతుడు మహానుభావుండని విందు. నవ్విహగవిభుని వృత్తాంతంబు తెలంగెలుంగ వినవలతు. వివరింపవేయనుటయు, నతండచ్యుతునాలోకించి యా సుపర్ణుండు నీవకా వినియుండదు అని భీష్మ డుపక్రమించాడు. భీష్ముని వాక్యాలనుబట్టి చూస్తే సౌపర్ణాఖ్యానం వ్రాయడంలో తిక్కన సోమయాజి లక్ష్యం యవతారమే అని. గరుత్మంతునకు తార్క్ష్యుడు అనే పర్యాయ పదము. ఈ పేరుతో గరుత్మంతుడు వేదమునందే వినబడుతున్నాడు. "భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః" ఇత్యాదికమంత్రంలో స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః, స్వస్తినో బృహస్పతిర్దధాతు-అని స్తుతింపబడినాడు. సర్పాదికృతమైన యరిష్టముఅనగా అహింస ఒతార్క్ష్యుడునేమి అనగా బండిచక్రమునకు ఇనుపకట్టువలె సంరక్షకుడు అని వ్యాఖ్యానింపబడింది. ఇంద్రుడు పూషయున్నగు ఉత్కృష్ట దేవతల వరుసలో తార్క్ష్యుడు పేర్కొనబడుట చూడ ఈతనిచరిత్ర గొప్పదియేయని తోచుచున్నది. గరుత్మంతుని విష్ణుభక్తునిగా అర్వాచీనులు ప్రతిపాదింపగా ప్రాచీనఋషులు విష్ణుస్వరూపునిగానే భావించినట్లు తోస్తుంది. ఈ రెండు మతములలో నన్నయ గరుత్మంతుడు విష్ణువేయను కథను అనుసంధించినట్లు కనబడుతుంది.

నన్నయభట్టారకుడు కథాకథనంలో బాలునివంటి మనస్తత్వం కలవాడు అనగా అప్రగల్భుడని కాదు. కథలో కథ, కథలో కథ, ఇసుకపాతరలాగ. తరుగని ఉత్సాహంతో ఈ కథలు చెప్పుకుపోవడం ఆయనకు ప్రీతి. తిక్కన కథా కథనంలో ప్రౌఢుల మనస్తత్వకలవాడు. కొంచెం చికిలిపట్టి శిల్ప విన్నాణము చూపవలెననే ఔత్సుక్యం కలవాడు.

ఒకటి రెండు ఉదాహరణలు తీసుకుందాము. కద్రు వినతలు సముద్ర తీరంలో అచ్చపు తెల్లదనంగల ఉచ్చైశ్రవమును చూచారు. ఇక్కడ ఉచ్చైశ్రవమని చెప్పడంతో తృప్తి పడ్డాడు తిక్కన. అట్టి యద్భుత తురంగముయొక్క జన్మవృత్తాంతమేమిటి అని ప్రశ్నించుకుంటాడు నన్నయ. ప్రశ్నించుకొని సముద్ర మథన వృత్తాంతం సవిస్తరంగా వినిపిస్తాడు. అదుగో అప్పుడు పుట్టినదీ అపురూపమైన గుఱ్ఱము అని కథ కలుపుతాడు, తిక్కనకు ఈ తాపత్రయం లేదు. అదియుచ్చైశ్రవమైనా ఒకటే కాకపోయినా ఒకటే. సుందరతురగోత్తమమది. దాని సౌందర్యాన్ని భావనచేసి కవిత్వ వీధిలో విహరించాడు.

"కరువునఁబోసిరో విధుని కాంతి సుధాబ్ధితరంగఁ దెచ్చిగం దరువాన రించిరో, హరు జటాస్థలికిందొడవైన యేటి పెన్నురువున జేసిరో యన మనోజ్ఞ సితచ్ఛవినుల్లసిల్లు సుందర తురగోత్తమంబు దవ్వుదవ్వులగాంచిరి చారులోచనల్" బాగానే ఉంది. ఆ గుఱ్ఱాన్ని ఉత్ప్రేక్షలతో ఇట్లా వర్ణిస్తే యువకుడో ప్రౌఢుడో అయిన శ్రోత సెబాసంటారు. పసవల్చు బాలకుడు అర్థంకాక ఆవులిస్తూ కూర్చుంటాడు. కాని ఆ గుఱ్ఱముచుట్టూ నన్నయ అల్లిన కథను చెవులు దోరబెట్టుకొని వింటాడు. కద్రూ వినతల కథలో ఈ హయము కీలక స్థానం ఆక్రమిస్తుంది కదా. దీనిని వర్ణించకపోతే ఎట్లాగనే చింత నన్నయకు లేదు. అందుచేత ఒక్క విశేషణంతో ముగించాడు "అవదాతాంబుజ ఫేనపుంజనిభునయ్యశ్వోత్తమున్" ఇంతే. ఉచ్చైశ్రవమువర్ణన. కీలక వస్తువును వర్ణించకపోతే ఎట్లాగ అంటాడు తిక్కన. ఆ వస్తువు పుట్టు పూర్వోత్తరాలు తెలిస్తే చాలు. దాని వర్ణన అంత ముఖ్యంకాదంటాడు నన్నయ. ప్రకృతోపయోగియైన యంశము ఉచ్చైశ్రవము యొక్క అచ్చపు తెలుపేగను. కథా శిల్పముదృష్ట్యా తిక్కన సోమయాజి పద్ధతియే సమీచీనమేమో. కథా పరాయణులకు నన్నయ మార్గము, కవులకు తిక్కన మార్గము నచ్చవచ్చును.

నన్నపార్యుడు వేగంగా కథ చెప్పుకొనిపోవడమే లక్ష్యంగా పెట్టుకొని ఒక్కొక్క సన్నివేశంమీద చాలాసేపు కాలూది నిలువకుండా వెళ్లిపోతుంటాడు. సోమయాజి ఆ కథ తాలూకు ముఖ్యాంశములమీద ప్రాణము ఎక్కువ పోస్తాడు. చూడండి. తల్లియైన వినత తొందరపాటువలన అనూరుడు కాళ్లు లేకుండా పుట్టాడు గదా. ఆ విధంగా తనను సంపూర్ణంగా పెరగనీక గ్రుడ్డు పగులగొట్టినందుకు జననిపై అలిగి శాపమిచ్చినాడు అనూరుడు. మళ్ళీ శాపమువలన నిష్క్రియకూడా వెంటనే చెప్పాడు. ఈ ఘట్టము కథకు ఆయువుపట్టేకద. తన ప్రథమసంతానము తనవేగిరపాటుచే అట్లు పూర్వాంగంతో మాత్రమే పుట్టుటచేత వినతకు కలిగిన భావములు, అనూరుని కోపము, తిరిగి తల్లిని కరుణించుట ఇవన్నీ భావావేశంకల చిన్నచిన్న కొక్కెములు. నన్నయకు గొలుసుమీదే దృష్టికాని, గొళ్ళాలమీద కాలయాపన చెయ్యడు. తిక్కన అక్రమాన్నం తనీ నాటకమునందువలె దశాక్రమభంగంలేకుండాపద్యములలో వ్రాశాడు. అనూరుడు తల్లికి శాపమిచ్చి మళ్ళీ యెందుకు అంతలోనే కరుణించాడో నన్నయ్య చెప్పలేదు. ఊహకు విడిచిపెట్టాడు తిక్కన యుక్తియుక్తంగా అనుసంధించాడు. ఎట్లన

"వెలవెలఁబాఱుచు, వడుకుచు
నలుకుచుదనమోము జూచు
నయ్యం గనన
ప్పులుఁగుకవ్వఁ జూచి తల్లీ
వలవదడలనిది విధాతృవశమయిన
వచ్చెన్."

అనిఓదార్చి, తన తమ్ముడు గరుత్మంతుడు మహాబలశాలియై పుట్టి ఆమె దాస్యత్వమును తొలగించునని ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు.

గరుత్మంతుడు పెరుగుతూండే దినాల్లో తల్లినంటి పెట్టుకొని ఉన్నట్లు నన్నయ వ్రాశాడు. వైనతేయుడు మహాసత్వసంపన్నుడు, విష్ణుసంశము అని సూచించుటకు కాబోలు తిక్కన దీనిని మార్చాడు. గరుడుడు తల్లిని విడచి స్వేచ్ఛగా ఆకాశ వీధుల విహరిస్తున్నాడు. అప్పుడొకనాడు నారద మహర్షి యాతనిని మందలించాడు.

'దాసియై నవతాలికిఁదల్లి పనులు
పేసినలగంగనద్దెనఁ జింతవంత
లేకనీవిట్లు దిరుగుట లెస్సయగునె
యద్భుతోజ్జ్వలతేజ కశ్యపతనూజ

అప్పుడు వినతానందనుడు మేల్కొని మా తల్లికి దాసీత్వ మేలవచ్చినదని నారద మహర్షి నడిగి తెలుసుకున్నాడు. ఇక్కడ నన్నయ రచనయే బాగున్నదనిపించింది. దాసీపుత్రుడు తల్లితోనే ఉండి తానుకూడా యథాశక్తిగా ఊడిగంచెయ్యాలి. గరుడుడు అంతేచేశాడు. కద్రువ ఆజ్ఞమీద పాము పిల్లలను తన వీపుమీద పెట్టుకొని కొండలు, వనాలు, నానాదేశాలు త్రిప్పుతువస్తూ ఉండేవాడు. ఒకనాడు వైనతేయుడు సర్పకుమారులను మోస్తూ ఉత్సాహవశంచేత సూర్యమండలానికి సమీపంగా వెళ్ళాడు. పన్నగ శిశువులు ఒళ్లుకాలి మూర్ఛపోయాయి. అప్పుడు కద్రువ, గురుత్మంతుని గట్టిగా చీవాట్లుపెట్టి, ఇంద్రుని ప్రార్థించి, వర్షంకురిపించి కుమారులను బ్రతికించుకొంది.

ఇదంతా చాలా సహజంగా యుక్తి యుక్తంగావుంది. తిక్కన ఈ చక్కని సన్నివేశం జారవిడిచాడు.

## పాత్రపోషణ విధానం

పాత్రపోషణ విధానంతో ఈ మహాకవులిద్దరి పద్ధతి స్వతంత్రంగా భిన్నంగావుంది. భాస మహాకవిని గురించి బాణుడొకమాట చెప్పాడు. 'నాటకైః బహుభూమికైః, సపతాకైర్యశోలేభే' భాసుడు అనేకపాత్రలు గల్గి, పతాకాబహుళమైన నాటకాలు వ్రాశాడని ఉగ్గడించాడు. నన్నయ భట్టుకు అవాంతర కథలు చెప్పడం చాలా ఇష్టమన్నాము. 125 పద్యాలు మాత్రంగల సౌపర్ణోపాఖ్యానంలో రెండుమూడు పతాకావృత్తాంతాలు బహునేర్పుతో ముత్యాలు చుట్టినట్లు అతికాడు. ఈ నేర్పు తిక్కనకు లేదని చెప్పజాలముకాని, అతడు ప్రదర్శించలేదని అంటాము. గరుత్మంతుడు నిషాదులను మ్రింగినప్పుడుగొంతుకకుఅడ్డపడిన బ్రాహ్మణుడొక పానకంలో పుడక. ఇక్కడ మరియొకటి చెప్పాం. నన్నయ గరుత్మంతునికి బ్రాహ్మణభక్తి చాలా వున్నట్లు కనపడుతుంది. అందుకు కారణంవుంది. రాజరాజ నరేంద్రుడు "భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతి" గలవాడని మనము జ్ఞాపకం చేసుకోవాలి; దీనికే మరియొక తార్కాణం. గరుత్మంతుడు వృక్షశాఖను ఎక్కడ పడవెయ్యాలనే సందేహంలో పడ్డాడు. తండ్రిదైన అరణ్యదేశం ఉంది. అక్కడ చెట్టుకొమ్మను పడవేస్తాను అన్నాడు. తిక్కన ఈ నిషాద వృత్తాంతము మొదలైనవి పరిహరించాడు. కాని అతని గరుత్మంతుడా పెద్ద కొమ్మను పుళిందదేశముమీద విడిచాడట. ఎందుకంటే అదినిందితాచారయుతము. నన్నయ తిక్కనల గరుడునికన్న అతనితండ్రికశ్యపమహర్షి సజ్జనుడు. ఆయన చెప్పిన సలహా యేమంటే "హిమవత్పర్వత ప్రాంతము అమానుషము. దానికి నిష్పురుషనగము అనిపేరు. అక్కడ ఈ పెద్దకొమ్మ విడువదగినది". మూడవ పతాక వృత్తాంతము కశ్యపుని పుత్రకామేష్టి - గరుత్మంతుని జననమునకు సంబంధించినది.

ఇది యిట్లుంచి వీరి పాత్రపోషణ పద్ధతులు కొంచెం చూద్దాం. నన్నయ బహుభూమికా ప్రీతిగల వాడంటిమి కదా. ఈ చిన్నకథలోనే ఆయన ఐదుగురుపాత్రల్ని నిర్దిష్ట రేఖలతో సరి పెట్టాడు. ఎవరంటే, కద్రువ, వినత, కశ్యపమహర్షి, గరుత్మంతుడు ఇంద్రుడు. తిక్కనకిది నచ్చలేదు కాబోలు, కథనంతను రెండుపాత్రల నడుమ సాంద్ర[illegible]సంఘర్షణలోనికి ఘనీభవింపజేశాడు. కద్రువ, గరుత్మంతుడు—వీరిద్దరే ఈతని కథనములో ముఖ్యపాత్రలు. వినతకొంత దూరంవచ్చి అదృశ్యమైంది, అంతర్వాహినియైన సరస్వతీ నదిలాగ. తిక్కనచేసిన పాత్ర చిత్రణమును ముందు పరిశీలిద్దాము.

తిక్కన—కద్రువ. ఈమెకుత్సితురాలు, మంచిమాటకత్తె. సవతియైన వినతను పల్లటీకొట్టించిన విధము ఎరుగుదుము. తల్లి దాస్యవిముక్తిని గోరివైనతేయు డామెను అనునయించి మాట్లాడినాడు. అప్పుడు కద్రువ మొగంబు ముఅకటించుకొనుచు గరుత్మంతున కిట్లనియె. 'బలవంతుండవు నేర్పు చందములఁ జెప్పం జాలియూరిత్తప లుక్కల దేర్పంబనిలేదు తల్లికి మదింగూర్తేని వేపోయిలో కులనిన్నుం బ్రణుతింపఁ దెమ్మమృతమున్ ఘోరంపు దాస్యంబునేఁ దొలగంబెట్టెద మీకనంతమగు సంతోషంబుసంధిల్లగన్''. సంజయ రాయబారం వ్రాసిన తిక్కన వెంటనే ప్రత్యక్షముతూనేవున్నాడు, "మా కుంగుడుమిండిదె మీరు ప్రక్కఁ గొనుఁడు చదురడచిన మనసుపొందు చక్కంబడునా" అన్న సూటిపోటులు ఇక్కడికూడ కనబడుతూనే వుంటాయి.

తిక్కన—గరుత్మంతుడు—అసాధ్యుడు. శత్రువుకన్నశత్రువుచేతితోనే పొడువగల నేర్పరి. సరెయని అమృతంతెచ్చి, చూపెట్టి, తల్లిదాస్యం విడిపించుకొని, అమృతభాండము ఇవ్వకుండా చేతబుచ్చుకున్నాడు. ఇదేమి అన్యాయం అంటే అతని సమాధానం ఇది...."నీవు అమృతం తెమ్మన్నావు. కాని మీకు ఇమ్మన లేదు. ఇచ్చుట షరతులో లేదుగదా" అనిచెప్పి ఇంద్రుడికి అమృతము తిరిగి అప్పగించాడు. షేక్స్పియరు నాటకంలో షైలాకు అనుకుత్సితుని వంచించిన పోర్షియావంటి బుద్ధిమంతుడు వైనతేయుడు. తిక్కన కల్పన యేమి బాగున్నది అని కొందరనవచ్చును. కాని దుర్మార్గులను ఒకొక్కప్పుడు వంచనచేతనే జయించవలసివస్తుంది. గరుత్మంతుడు విష్ణువేకదా. మోహినీ అవతారమెత్తి, విష్ణువు రాక్షసులను వంచించి అమృతము దేవతలకే దక్కించాడు. లోకోపద్రవకారులైన పన్నగములకు, అసత్యశంకచేతనైనా దేవతలయన్నమును అందింపకూడదు. సత్యమునుకూడి అహింసకులోగి యుండదగినదేయని తిక్కనగారు తరుచు ఉపన్యసించును.

నన్నయ ప్రకారము గరుత్మంతుని జీవితములో వినత ప్రభావంసుదూరము వ్యాపించినది. ఈ తల్లి కొడుకు లిరువురును దాస్యహైన్యత అనుభవించినారు. అతనికి యౌవనం వచ్చిన తర్వాత తల్లి దాస్యము, తాను పాములకు బంటగుట తెలిసివచ్చింది, తల్లిని అడిగాడు "కుల పర్వతములను సైతము తుండముతో నుగ్గుచేయగల నావంటి మహా బలశాలికి ఈక్షుద్రపన్నగములను మోయవలసినదీనదశ యెట్లు వచ్చెను" వినత జరిగిన వృత్తాంతము అంతా చెప్పి ఇట్లున్నది. "కొడుకులు సమర్థులైనందల్లిదండ్రులయిడుములు వోయుటయెందునుం గలయదిగావున నీయట్టి సత్పుత్రుంబడసియు దాసినై యుండు దాననే". తల్లి దాస్యవిముక్తయగుటకు నుపాయమును గరుడుడు కద్రువనుగాక పాములనే యడిగినాడు. అమృతాహరణార్థము పోవు గరుత్మంతుని తల్లి దీవించిన విధము హృదయమును ద్రవీకరించును. ఇక్కడ వినతపుత్రవాత్సల్యాన్ని కద్రువ దురహంకృతితో పోల్చదలచుకున్నాడు నన్నయ. అసలీ సౌపర్ణోపాఖ్యానానికిఆరంభమునందే మాతృప్రేమ విషయమైన ప్రశ్న కలదుగదా. వినతా గరుత్మంతులు ఆదర్శప్రాయులైన మాతాపుత్రులు "గరుడుడు తద్వృత్తాంతం బంతయుందల్లికి జెప్పి యమృతాహరణారంబగిగెదనని మ్రొక్కిన సంతసిల్లి కొడుకుం గౌగిలించుకొని,

"అనలుండు పక్షయుగ్మమమృ
తాంశుఁడువీఁపన
లుండుమస్తకం, బినుఁడు సమస్త
దేహమును
నెప్పుడుఁగాచుచునీకభీష్టముల్
ఘనముగఁ
జేయుచుండెడు జగన్నుతయు
న్నతియున్ జయం
బుఁజే కొనుమనియిచ్చెదీవనలు
గోరిఖగేంద్రునకు బ్రియంబునన్"

కద్రువ తానుకన్న కొడుకులను శపించిన దుస్స్వభావ. వినత పరమ సాత్వికురాలు. వినతయుడిన యీ దీవయందుమనము నన్నపార్యుని ఆర్ష సంప్రదాయజ్ఞతను చక్కగా గుర్తింతుము.

# పుస్తక పరిచయము

## దొర-ఏడు సున్నాలు

పోతుకూచి సాంబశివరావు వ్రాసిన రెండు నాటిక లివి. మొదటిది ఎంత గంభీరంగా సాగుతుందో, రెండవది అంత హాస్యభరితంగా ఉంటుంది. ప్రదర్శించడానికి బహుయోగ్య మైనవి.

ఒక తరహావారు తెలుగులో మంచి నాటకాలు లేవని ఇంకా అంటూనే ఉన్నారు. మరొక వర్గంవారు ఉత్తమ నాటకాలను ప్రదర్శించగల నటులతోపాటు నాటకశాలలు గూడా లేవని ఘోషిస్తున్నారు. ఏది యేమయినా, ఉత్తమ నాటకాలు పాఠక లోకానికి లభించడం లేదనే అభిప్రాయంతో ఏకీభవించడానికి అభిజ్ఞులు విముఖంగా లేరు. అసలు అదృష్టమో దురదృష్టమో తెలియదు కాని, తెలుగు సాహితీ తపస్వి శ్రవ్యంమీద చూపిన శ్రద్ధ దృశ్యం వైపు సాగనివ్వలేదు. అభిజ్ఞాన శాకుంతలంలాంటి దృశ్య కావ్యాలు సైతం తెలుగులో శృంగార శాకుంతలాలై శ్రవణపేయములే అయాయి. శ్రవణానందమే ఆదరణీయమైనంతగా చాక్షుషక్రతువు అభిలషణీయం కాలేదేమో మన కనిపిస్తుంది. ఉద్యోగ విజయాలవంటివి దృశ్య కావ్యాలుగానే అవతరించినా, వాటిలో శ్రవణపేయతకున్న స్థానం దృశ్యానికి లేదనిపించడానికి అందలి పద్య బాహుళ్యమే హేతువు. ఈ స్థితిలో వచ్చిన కన్యాశుల్కం చాలావరకు రంగస్థల నాటక రచనకు ఉద్దీపన మిచ్చింది. సర్వసౌకర్యాలూ కల నాటక శాలలు మనకు లేవన్న విషయం కన్యాశుల్క ప్రదర్శనలో గోచరిస్తుంది. ఈలోపం తీరేవరకూ ఉత్తమ నాటకా విష్కారానికి సావకాశం ఉండదనే వారితో కొంతవరకూ ఏకీభవించగలం. ఇంతకంటె ముఖ్యమైనది నటులతో రచయితకు సన్నిహిత సంబంధం అవసరమనే దానితో పూర్తిగా ఏకీభవించగలం.

ఈ పరిచయంతో నటనానుభవం కల సాంబశివరావు రెండు నాటికలనూ ప్రదర్శన యోగ్యంగా రచించారు.

దొర—

ఈ నాటికలో సుధాకర్ అనే ధనస్వామి భృత్యవర్గానికి చేసిన అన్యాయాలన్నీ ఒకానొక సంఘటనలో ఆకస్మికంగా వెలువడుతాయి. అన్నీ తిరిగేసరికి అతనిలో మానవత మేలుకొంటుంది. అంతలోనే యథాపూర్వస్థితి బలీయం కావడంతో కథ ముగుస్తుంది. ఏకబిగిని సాగే ఇతివృత్తంతో నడిచింది.

ఇది ఎంత గంభీరంగా నడుస్తుందో-అంత హాస్యభరితంగానూ నడుస్తుంది ఏడుసున్నాలు.

శివం, శవం, భవం, భారం, ఇహం, వరం, శూన్యం అని పాత్రల పేర్లలోనే సున్న లుంచారు రచయిత.

శివంతో ప్రారంభమై, శూన్యంతో ముగించిన పాత్రల ఎన్నికలోనే ఇతివృత్తం హాస్యమయమని తెలుతుంది. కాలేజీ విద్యార్థులు సుఖంగా ప్రదర్శించవచ్చు. నామమాత్రంగా కూడా స్త్రీ లేని నాటిక యిది.

* * * *

## మేల్కొన్న ఆకాశం

రచన : మాదిరాజు రంగారావు

నీలాకాశ గుహా ముఖంనుండి
బయల్వెడలిన కాంతి సింహం
నిర్మలకాసారదర్పణంలో
తన ముఖం చూసుక మురుస్తూ
రోదసీ వితర్దికపై
బంగారు పూలు విరియబూసిన
కాంతివల్లీ నికుంజంలా
సంతోషంతో కూర్చుంది....

అని ప్రారంభించి—

"....ధాత్రి నిండా వాలిపోయి
సాంతం రాత్రి మయం చేయాలని
ఉద్రేకంతో రివ్వు రివ్వున వేగంతో
ఉరికి ఉరికి వస్తున్నవి పక్షులు,
సన్నని కాంతి ఖడ్గజాలంతో
అన్నీ హాయిగా విశ్రాంతి తీసుకుంటవి
విహరించే శ్వేతేతర పక్షులన్నీ
వినువించే స్వేచ్ఛేతరకక్షలోవి,

అని ముగించారు రచయిత.

మనస్సుకల మానిసికి కల అభిరుచి బహుచిత్రమైనది. ఈ అభిరుచి బహుముఖాలుగా ఉంటుంది. బహుజనులలో అభిరుచి వైవిధ్యం ఉండకపోయినాజనబాహుళ్యాభిరుచిని పట్టే మనస్సులకు భిన్నరుచులపై కోరిక లేకపోయినా, ప్రసార శక్తి ఉంటుంది. ఈ ప్రసారంలో ఒకటి కవితా రూపంతో సాక్షాత్కరించింది.

'మానిషాద' అని వాల్మీకి కోకిల పంచమ స్వరంతో కరుణగాథను రసభరితంగా అనుగ్రహించిన నాటి నుండి విషాద చర్యలను నిషేధించే కృతులు వెలువడుతూనే యున్నవి. ఈ నిషేధం విషేధ రూపంలోనే వెలువడడం కావ్యలక్షణం కాదని అన్న ఆర్యవాక్యాన్ని ఆర్షవాక్యంగా త్రోసిపుచ్చి, విధి, నిషేధాలను యథాతథంగా చిత్రించే రచనలు వెలువడే రోజులలో శాఖీలు, దస్తావేజులు, త్రైపియత్ కవితలపై అటు దృష్టిపోవివ్వని కావ్యగానంచేసే వారి కోసం ఉవ్విళ్లూరేవారికి 'మేల్కొన్న ఆకాశం' ఆశాభంగం కలిగించదు.

నీలాకాశగుహా ముఖంనుండి
బయల్వెడలిన కాంతి సింహం—

అని గొంతు విప్పేసరికి ఒక్కసారి గుండె పులకిస్తుంది. ఆకాశ గుహా ముఖంనుండి వచ్చే కాంతి సింహంగా సూర్యుని దర్శించి ప్రదర్శించే నవభావుకుని ఊహావైశిష్ట్యానికి—

విద్యుత్కాంతిరేఖా ప్రసరణలా
కాలగమనం సాగుతున్నంతవరకు
మెట్లు మెట్లుగా మెలగిపోవు
చరిత్రకు ఉండదు అంతిమదశ
కాలగమనం ఆగిపోనంతవరకు
సంస్కృతీ శిల్పంగా దూరిపోవు
మానవుడు చుంబించగలడు ఆకాశం
మానవతకు సిద్ధించదు సంపూర్ణత్వం

సంపూర్ణత సిద్ధించిననాడు ఆకాశ చుంబన ప్రమేయమూ లేదు, చరిత్రలో అంతిమ ప్రకరణాలోచనా ఉండదు.

ఏ తుషార శీతల కాంతిలో కనులు విప్పుచూ లేచి ఉషోరాగాన్ని అవలోకించి, అవలోకించి ఆ అఖిల సౌందర్యాన్ని ఆరాధించడం అలవరచుకొన్నాడో మానవుడు నాటి నుండి నేటివరకూ పూర్ణత్వ సిద్ధి కోసం అన్వేషణలో అనేకాలను గ్రహిస్తున్నాడే కాని ఏకమైన పూర్ణతను సాధించలేకపోటూనే ఉన్నాడు. అది సిద్ధించడంతో మానవత దాని పరిధులనే అతిక్రమిస్తుంది—అని భావించిన కవి అభినందనీయుడు,

సౌందర్యం ఎరుగదు సప్తతంత్రీవీణ
మాధుర్యం ఎరుగదు సప్తవర్ణ
కాంతి ఖండ
సప్తవర సౌందర్యం విలీనకకాంతిరేఖ
సపస్వర మాధురీసంలీన
నాదబ్రహ్మము
ఈ రెండింటి సమాహారము,
ఆత్మగత
రసావిష్కార వైశేషిక కాంతిగీతం,

అని గొంతు విప్పేసరికి ఒక్కసారి ఇదీ మేల్కొన్న ఆకాశం....!

# అంధగీతి

వేదుల సత్యనారాయణశాస్త్రి

అంధ భిక్షువు డొక డుదయమ్మునుండి
సంజదాక యాతాయాత జనసమూహ
సంకులమ్మైన వీధీవిటంకమందు
కంఠ మేకతారకు శ్రుతిగలిపి పాడు
చుండు గొంతెత్తి చెమ్మట లోడ్చుకొనుచు.

కానబడవేమి స్వామి నా కంటి కన్న
యంధ కంఠవినిర్గతార్తారవమ్ము
జనుల చెవిసోకు నదవకాశమ్ము లేదు
ఆతపానిల గర్భమం దణగిపోవు.

అతడు తనముందు పరచికొన్నట్టి చింక
పాతపై దారి బోవు కృపాళు లెవరో
తోచినది పారవైచిపోదురు. కదోది
యెవ్వ రేమిచ్చిరో పాప మెరుగలేడు.

ఆ పథమ్మునన్నే బోయినప్పు డెల్ల
అతడు కన్పించు, విన్పించు నతని స్వరము,
కాని గ్రుడ్డివాడను కనికరము దక్క
పాట భావమ్ము నాయెద నాటలేదు.

ప్రొద్దు వ్రాలిన తఱి సాగిపోవు నంధ
భిక్షుకుని పాట నేడు విన్పించినంత
ఏ నిగూఢార్థమో స్ఫురియించి యెదద
అవశమై నిల్చిపోతి తదంతికమున.

గోకుల బృందావనీకుంజ వీధుల
మారుమ్రోగిన మురళీరవమ్ము
ప్రాచీనతాపసాశ్రమ వాటికల నుండి
నిరమించిన యౌపనిషద రవము
కాశికా గంగాపగా వీచికల మ్రోగు
ఆచార్య వరుల బోధారవమ్ము
శారదాపాద శింజాన మంజీరమో
సాహితీ సరస వాచారవమ్ము
అంధు మొఱతోడ బెరసి నాయాత్మ విరిసి
అనఖశిఖ కమ్మి రక్తనాళాంతరాంత
రాల స్పందించి పెనుగాలి వోలె రేగి
తూల్చివైచె నహంకార ధూళినెల్ల.

చూడవలెనన్న కాంక్షతో పాడుకొనెడు
అంధు నార్తారవమె సత్యమైన గీతి
కన్నులుండియు చూడగా కాంక్షలేని
అంధుడను నేనె నా పాటె యంధగీతి.

## ప్రసార విశేషాలు

భారతదేశంలోని ముఖ్యోద్యమాలు దాదాపు అన్ని ప్రాంతీయ భాషా సను కాలిక సాహిత్యాలనూ ప్రభావితం చేశాయి. 'దక్షిణ్ కా ధర్మ ప్రాణ్ సాహిత్య' అనే శీర్షిక క్రింద 'తెలుగూ కా వీరశైవ సాహిత్య' అనే హిందీ ప్రసంగంలో రామమూర్తి రేణు, తెలుగు సాహిత్యం మీద వీరశైవ మత ప్రభా వాన్ని చర్చిస్తారు. జూన్ 20-వ తేదీ రాత్రి 7-15 గంటలకు అఖిల్ ప్రదాన్ కార్యక్రమంలో ఈ ప్రసంగాన్ని హైదరాబాద్-ఏ నుంచి వినవచ్చును.

* * *

వివిధ ప్రాంతాలకు చెందిన భారతీయ జ్ఞానుల రచనల్లో బోధలలో ఎట్టి పోలిక లున్నాయో శ్రోతలకు విశదంచేయడానికి 'ధ్వని—ప్రతి ధ్వని' అనే కార్యక్రమాల వరుస ఉద్దేశింపబడ్డది. ఇందులో మొదటిది 'మీరా ఆండాళ్' అను విషయముపై శ్రీమతి ఎన్. నారాయణ్‌గారి హిందీ ప్రసంగము వింటారు. జూన్ 22-వ తేదీ మధ్యాహ్నం ఒంటిగంటకు స్త్రీల కార్యక్రమంలో హైదరాబాద్-ఏ నుంచి వినవచ్చును.

* * *

శ్రీనాథుని కాశీఖండంలో సుశీల ఒక నాయిక. విద్యాధరుడు ఆమెను ప్రేమించి మలయాద్రికి ఎగిరిపోతూ వుంటాడు. దారిలో ఒక రాక్షసుడు ఆమెనుచూచి మోహిస్తాడు. విద్యాధరుడూ రాక్షసుడూ పోట్లాడుకుని ఇద్దరూ చచ్చిపోతారు. సుశీల విద్యాధరుడితో సహగమనం చేసి కళావతిగా మళ్ళీ పుడుతుంది. విద్యాధరుడు మలయకేతువై జన్మిస్తాడు. వాళ్ళిదరూ దంపతులవుతారు. ఇదీ 'ప్రబంధ నాయికలు—కాశీఖండంలోని కళావతి' అనే తెలుగు రూపకానికి కథా వస్తువు. జూన్ 16-వ తేదీ సాయంకాలం 6-15 గంటలకు హైదరాబాద్-బి విజయవాడలనుంచి ఈ రూపకం ప్రసార మవుతుంది.

## కేంద్ర కార్యక్రమ సలహాసంఘం

కేంద్ర సమాచార రేడియో మంత్రిత్వ శాఖకు చెందిన కేంద్ర కార్యక్రమ సలహాసంఘాన్ని ఏడుగురు సభ్యులతో పునర్నియమించారు. వారి సభ్యత్వ కాలపరిమితి రెండు సంవత్సరాలు.

ఆ సభ్యుల పేర్లివి:— డాక్టర్ మోతీచంద్ర, డైరెక్టర్, ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం, బొంబాయి, ప్రొఫెసర్ వి. కె. ఎన్. మీనన్, డైరెక్టర్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, న్యూఢిల్లీ, శ్రీ ఉమాశంకర్ జోషి అహమదాబాదు, శ్రీ రాధాశంకర్ బెనర్జీ ఎమ్.పి., కలకత్తా, శ్రీ అమర్ సింగ్ ఎమ్.పి., బిలాస్‌పూర్, జైవిక్కార పద్మనాభపిళ్లై వాంఛియూర్, తిరువనంతపురం, వి. ఎన్. గోఖలే, బొంబాయి హైకోర్టు మాజీ న్యాయమూర్తి.

ఆకాశవాణి కార్యక్రమాలను రూపొందించడంలో స్థూలంగా యీ మంత్రిత్వ శాఖకు సలహాలివ్వడమే ఈ సంఘం పని.

---

అసలైన పనివాళ్ళు తమ దర్బారాను వాయించుకోరు. తేనెటీగ చూడండి, ఎంత నిశబ్దంగా తేనెను సేకరిస్తుందో. ఇక కందిరీగ అంటారా, అది చేసే రణగొణ ధ్వనికి అంతూ పొంతూ వుండదు. జూన్ 23-వ తేదీ మధ్యాహ్నం 3 30 గంటలకు ఆకాశవాణి హైదరాబాద్‌నుంచి బాలానంద కార్యక్రమంలో, 'తేనెటీగ, కందిరీగ' అనే గేయకథను వినండి.

రచన, నిర్వహణ: ఎస్. రాఘవరావు

* * *

ప్రభుత్వ వ్యవసాయమా, ప్రైవేటు వ్యవసాయమా ? ముఖ్యంగా దేశము యొక్క ఇప్పటి ప్రారిశ్రామికాభివృద్ధి సందర్భంలో రెండిటి అనుకూలాలనూ వ్యక్తంచేసే చర్చను జూన్ 16-వ తేదీ రాత్రి 8-15 గంటలకు ఆకాశవాణి హైదరాబాద్‌నుంచి వినవచ్చును. ఇందులో శ్రీ ఎస్. భగవాన్‌దాస్ ప్రభుత్వ దృక్పథాన్ని, శ్రీ పి. ఎల్. భండారి పారిశ్రామికుని దృక్పథాన్నీ వ్యక్తం చేసారు.

# ప్రసార విశేషాలు

## మద్రాస్ షార్ట్‌వేవ్ ప్రసారాలు

ఉదయం 60.98 మీ (4920 కిలోసై)
మధ్యాహ్నం 49.30 మీ (6085 కిలోసై)
సాయంత్రం 60.98 మీ (4920 కిలోసై)

పైన ప్రచురించిన షార్ట్‌వేవ్ మీటర్లలో ఉదయం 7-00 నుండి 7-15 వరకు, మ॥ 1-50 నుండి 2-00 వరకు, సాయంత్రం 7-00 నుండి 7-15 వరకు, రాత్రి 9-30 నుండి 10-30 వరకు మద్రాస్(ఎ) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

సోమవారములు రాత్రి 9-15 గంటలనుండీ, బుధవారములు రాత్రి 7-45 నుండి 9-30 వరకూ పై మీటర్లలో మద్రాస్ (ఎ) కార్యక్రమాలను వినవచ్చును. తక్కిన సమయాలలో పై షార్ట్‌వేవ్ మీటర్లలో మద్రాస్ (బి) కార్యక్రమాలు ప్రసారమౌతాయి.

## భూశయనం

నాటిక

మూలం: టాల్‌స్టాయ్ కథానిక

నాటకీయం: ఉమ

ఆశకు అవధులు లేవంటారు. మానవుడికి ఎప్పటికైనా సంతృప్తి అంటూ వుంటుందా?

ఎక్కడో ఊరికే కావలసినంత పంటభూమి కోయజాతివారి చ్చేస్తున్నారని ఆ రైతుకి ఆనోటా ఆనోటా కబురు చేరుతుంది.

గోచిపాతంత భూమిలో, ఇలా ఎంత కాలం వేగడం? హాయిగా ఆ కోయవారి దగ్గరికి పోయి ఇంతభూమి అడిగి పుచ్చుకుని మోతు బరినైపోతానని ప్రయాణ మవుతాడు.

రైతుకి ఆ కోయలు ఘనమైన స్వాగతమిచ్చారు. రైతుకూడా వారికి కట్నాలూ కానుకలూ ఇచ్చాడు. వారు ఎంతో సంతోషించి రైతూ! నీకు కావలసినంత భూమి ఇస్తాం. కాని ఒకే ఒక షరతు. సూర్యోదయంతో బైలుదేరి సూర్యాస్తమయానికి మాదగ్గరికి నీవు తిరిగిరావాలి ఈలోగా నీవెంతదూరం నడిచిరాగలవో ఆంతభూమీ నీదే! అనగానే రైతు బ్రహ్మానంద భరితుడయాడు. మరేనని సూర్యోదయం అవగానే రైతు నడవ డానికి పూనుకున్నాడు. ఆశకొద్దీ కాలగమనం మాట మర్చిపోయి అలా నడుస్తూ పోయాడు, సూర్యాస్తమయం ఇంక కాబోతొందనగా తిరుగు ముఖం పట్టాడు. కాని, కోయవారికి సూర్యాస్తమయంలోగాచేరాలె.నడవలసినదిచాలా వుందేఆని పరుగెత్తాడు.ఆలసిపోయాడు. ఎలానైతే అటు సూర్యుడు అస్తమించాడు. ఇటు రైతు కోయవారిదగ్గర కొచ్చి నేలకూడాడు, రక్తం కక్కుకుని చచ్చిపోయాడు! అందరూ అనుకున్నారు "భూశయనానికి భూమెంత కావాలి? అతడు ఆరడుగులేగా!"

భూశయనం నాటికను మద్రాసు, విజయవాడ, హైదరాబాద్ కేంద్రాల నుంచి జూన్ 27-వ తేదీ బుధవారము రాత్రి 8 గంటలకు ప్రసార మవుతుంది.

నిర్వహణ: ఉమ

## కిన్నెరసాని

సంగీత నాటకము

రచన: విశ్వనాథ సత్యనారాయణ

సంగీతం: మల్లిక్

సమర్పణ: ఉష

కల్పన:

కిన్నెర మహా పతివ్రత. అందరు తెలుగు కన్నెలకు మల్లెనే ఉద్విగ్న హృదయ. ఎక్కువ తెలుగుకుటుంబాలకు సామాన్యమైన అత్తా కోడళ్ళ పోరాటం ఆ ఇంట్లోనూ వెలిసింది. కొడుకు సుఖ మెరుగని అత్తకు కిన్నెర మీదనిందలారోపించటం పనిఐంది. ఒకప్పుడు ఆవిడ చేసిన నింద భరించటం కష్టమైంది. కిన్నెర హృదయం శోకం చేత ప్రళయ సముద్రం అయింది. కిన్నెర భర్త ఏంచేస్తాడు? తల్లినీ కాదనలేడు, భార్యను ఓదార్చుకోనూ లేడు. ఆవేళ హృదయంతో కిన్నెర అడవుల వెంట పరుగెత్తింది, భర్తపోయి ఆమెను వద్దని కౌగిలించుకున్నాడు. ఆమె అతని కౌగిట్లోనే కరిగి నీరై వాగై ప్రవహించింది. అతడు శోకించే శోకించి శిల అయినాడు.

పాల్గొనువారు: వి.బి. శ్రీనివాస్
ఎస్. జానకి
ఎమ్. సునంద
బి. గోపాలం
ఎ. ఎం. మృణాళిని
వి. బాలాత్రిపురసుందరి
కె. రమ
జి. వైదేహి

కిన్నెరసాని—సంగీత నాటకము జూన్ 18-వ తేదీ సోమవారం రాత్రి 9-30 గంటలకు మద్రాస్, విజయవాడ, హైదరాబాద్ కేంద్రాలనుండి వినగలరు.

## అత్త

హాస్య రూపకము

తమిళ మాతృక: పి.జి.ఎస్.

తెనిగింపు: చల్లా రాధాకృష్ణశర్మ

ఆయన లాయరు, ఆవిడ పంతులమ్మ మొత్తంమీద సంసారం సుఖముగానే జరిగిపోయింది.

ఒకనాడు మద్రాస్‌నుంచి తంతి వస్తుంది. ంద సంతకం 'అత్త' అని వుంటుంది. భార్యాభర్త లిద్దరికీ అత్త బుండడంచేత, ఎవరి అత్త వస్తూందో తెలియక సతమతమైపోతారు. ఒకరి అత్త బొత్తిగా సనాతనం మనిషి. ఆవిడగారొస్తే మడీగట్రా సరీగ్గా ఉండకపోతే చిర్రూ బుర్రూ మంటుందని భార్య ఇల్లంతా సర్దడం ప్రారంభిస్తుంది. 'మా అత్తకే! అటువంటి చాందసాలేవీ లేవు. ఎక్కడ వస్తువులక్కడ వుండనీ' అని లాయరుగారు భార్య తీసేసిన వస్తువులు తిరిగి తీసుకొచ్చి యథా స్థానాల్లో పెడతాడు, ఇల్లంతా నానా గల్లంతుగా వుంటుంది.

ఇద్దరూ రాజీకివచ్చి అత్తకు స్వాగత మివ్వడానికి రైలుదగ్గరికి వెడుతారు. రైలొచ్చింది. కాని అత్త కనిపించదు. భార్యాభర్త లిద్దరూ నిరాశచెంది ఇంటికి తిరిగొస్తారు.

కొంచెంసేపైనాక ఒకతనొస్తాడు, పళ్ళికిలిస్తూ టెలిగ్రాం ఇచ్చాను. అంద లేదా, అని అడుగుతాడు. ఆదివీడుగా! నువ్వా టెలిగ్రాం ఇస్తే? అత్త అని సంతకం పెట్టావేమిటిరా? అని అడిగితే ఈమధ్య వంటకాలు తయారుచేయడం గురించి పత్రికల్లో రాస్తున్నా 'అత్త' అనే మారుపేరుతోనే, మీకు టెలిగ్రాం పంపాను అంటాడు.

అత్త—హాస్య రూపకాన్ని, జూన్ మాసం 25-వ తేదీ సోమవారం రాత్రి 9-15 గంటలకు మద్రాస్ కేంద్రంనుండి వినగలరు.

ooooooooooooooooooooo

## శనివారం జూన్ 16

శక 1884 జ్యేష్ఠ 26

ooooooooooooooooooooo

### మద్రాస్-ఏ

ఉ॥ ప్రసారము I

416·7 మీ (720 కిలోసై)

6.45 మంగళగానం
6.50 తుదిప్పాడల్‌గళ్
7.00 వాద్యగోష్ఠి •
7.10 నేటికార్యక్రమ వివరణ, వాతావరణ సూచన (తమిళము)•
7.15 తమిళంలో వార్తలు
7-30* వాద్య మాధురి‡ సింధుభైరవి: ఆర్.వైద్యనాథన్
7.45 రేడియో శెయిదిమలర్ వార్తానమీక్ష [తమిళము]
8.00 మధురగీతం†
8.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

416·7 మీ (720 కిలోసై)

1.00 కదంబం†
1.30 గానమంజరి †
1.40 హిందీలో వార్తలు
1.50 గీతమంజరి †•
2.00 తమిళంలో వార్తలు
2-10 వయొలిన్: నిలయవిద్వాంసుడు
2.30 జయలక్ష్మి సుందరరాజన్
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

416·7 మీ (720 కిలోసై)

5-30* చిదంబరం జి. అంబుజక్కారను
6.05 ప్రాంతీయ శెయిదిగళ్
6.15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే) (7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పై గూడా)
7.15 తమిళంలో వార్తలు
7-30* వైక్కం సరస్వతి
8-00 తిరుగోకర్ణం ఎన్. రామచంద్రఅయ్యర్: వీణ
8-30 Radio News Reel (relay from Delhi)
8.40 వాద్య సంగీతం †
8-45 వాద్యగోష్ఠి
9-00 సంగీతామృతం ‡ సి. ఎస్. కృష్ణ అయ్యర్
9-15 మధురగీతము †
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమం గజాననరావ్ జోషి: వయొలిన్ (ఢిల్లీనుండి రిలే)
11.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### మద్రాస్ - బి

ఉ॥ ప్రసారము I

211·3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

6.45 మద్రాస్ ఏ వలె
7.00 తెలుగులో వార్తలు**
7.15 సుప్రభాతం సంస్కృత కార్యక్రమము మాలతీ మాధవం నాటిక (నాల్గవ అంకం) రచన, నిర్వహణ: డా॥ వి. రాఘవన్
7.30 మద్రాస్ ఏ వలె
7-45 మద్రాస్ ఏ వలె
8.00 ఆంగ్లములో వార్తలు
8.15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

211·3 మీ (1420 కిలోసై)
49·30 మీ (6085 కిలోసై)

1-00* మద్రాస్ ఏ వలె
1.30 ఆంగ్లములో వార్తలు
1.40 గీతమంజరి†
1.50 తెలుగులో వార్తలు**
2.00 మధురగీతం†
2-10 ముత్తుకువియల్ పిల్లల కార్యక్రమము (తమిళం)
3-00 For Children Arranged by Mabel Rao conducted by Uncle Handel
3-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

211·3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతం †
5.50 స్థానిక ప్రకటనలు, వాణిజ్యవార్తలు (ఆంగ్లం)
6.00 ఆంగ్లమున వార్తలు
6.05 మద్రాస్ ఏ వలె
6.15 కార్యక్రమ వివరణ (తమిళము)
6.20 టి.ఆర్.జి. రావు: వేణువు
7.00 తెలుగులో వార్తలు**
7.15 సంగీతమాల†
7-30 సంజీవి పర్వతం నాటిక (తమిళము) రచన: శంకర్
8-30 టి.ఎస్. వేంబు అయ్యర్
9.00 ఆంగ్లమున వార్తలు
9-15 Path of Progress: Harijan welfare talk
9-25 వాద్య సంగీతం †
9-30 పాశ్చాత్య సంగీతం†**
11.00 ప్రసార సమాప్తి

### విజయవాడ

357·1 మీ (840 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6.30* శుభోదయం
6.35 భక్తిరంజని వి. శ్రీనివాసన్, బృందం
6.55 ప్రసార విశేషాలు
7.00 తెలుగులో వార్తలు
7.15 సంగీత శిక్షణ
7-30 నిరాఘాటం శ్రీరామకృష్ణశాస్త్రి వయొలిన్
8.00 ఆంగ్లమున వార్తలు
8.15 హిందీలో వార్తలు
8.30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12.30* కార్మికుల కార్యక్రమం (హైదరాబాద్ నుండి రిలే)
1.00 వనితావాణి స్త్రీల కార్యక్రమము
రాధనురా కృష్ణా నారాయణరెడ్డి గేయము
ధ్రువతార సీరియల్ నాటిక రేడియో అనుసరణ: పెద్దింటి సుబ్బరామయ్య
పెళ్ళిపాట
శ్రోతల ఉత్తరాలు
మంగళం
1-30 యుగళ గీతావళి†
1.50 తెలుగులో వార్తలు
2-00 బొమ్మరిల్లు పిల్లల కార్యక్రమము
రాడండి రారండి
కలసి పాడుదామా
తపాలాసంచి
ప్రాచీన పరదేశ యాత్రికులు: హ్యూనిజ్
గొలుసుకథ మూడవభాగం
మనపాట
చిలుకపలుకులు
సెలవు
3.00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6.00* స్థానిక ప్రకటనలు
6.05 ప్రాంతీయ వార్తలు
6.15 గ్రామస్థుల కార్యక్రమం ప్రబంధ నాయికలు: కళావతి (కాశీఖండం) మార్కెట్ సమీక్ష ప్రకటనలు, ధరలు, వాతావరణము
7.00 తెలుగులో వార్తలు
7.15 గ్రామస్థుల కార్యక్రమం ఫిల్మ్ సంగీతం† విశేషాలేమిటి చేయంగల విన్నపాలు
7-30 పుస్తక పరిచయము
7-40 ఫిల్మ్ సంగీతం †
8.00 నిరాఘాటం శ్రీరామకృష్ణశాస్త్రి వయొలిన్
8-30 Radio News Reel (relay from Delhi
8-40 విరామ సంగీతం
8.45 హైదరాబాద్ వలె
9.00 ఆంగ్లమున వార్తలు
9-15 రామ్బాబు-దొరబాబు నాటిక రచన: పి.హెచ్.వి.ఆర్. సుబ్బరాయశాస్త్రి
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము గజాననరావ్ జోషి: వయొలిన్ (ఢిల్లీనుండి రిలే)
11.00* వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

### మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధభారతి (రిలే)
(వివరాలు 52-వ పేజీలో)

• షార్ట్‌వేవ్‌పై గూడా
**మీడియంవేవ్‌పై మాత్రం



† గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

శనివారం జూన్ 16

## హైదరాబాద్-ఎ

405.4 మీ (740 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని
(విజయవాడ నుండి రిలే)
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
(విజయవాడనుండి రిలే)
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీ లోవార్తలు
8-30 బృందగానం: లలిత్ సంగీత్
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
కార్మిక గేయాలు
వార్తావాహిని
సినీగీతి †
1-00 వనితావాణి
(విజయవాడనుండి రిలే)
1-30 లలిత్ సంగీత్:
ఆర్. రాధ, ఆర్. నాగలక్ష్మి
1-45 విరామ సంగీతము
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

3-30 బాలానందం
పిల్లల కార్యక్రమము
4-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 నైవరస్
ఉర్దూలో కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు
7-15 షోక్-ఓ-సాజ్: ఘజల్, గీత్
7-20 శ్రోతల ఉత్తరాలకు జవాబులు
(ఉర్దూ)
7-30 ప్రసంగము
(విజయవాడనుండి రిలే)
7-40 Question-Hour
8-00 ప్రసంగము (ఉర్దూ)
8-10 విరామ సంగీతం
8-15 On the anvil:
Public and Private enterprise
Discussion
Participants.
P. L. Bhandari
N Bhagwan Das
8-30 Radio News Reel
8-40 విరామ సంగీతం
8-45 చెప్పుకోతగ్గ వార్తలు
వార్తాసమీక్ష
8-55 Today in Parliament
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 అఖిల భారత సంగీత
కార్యక్రమము
గజాననరావ్ జోషి:
వయొలిన్
(ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

ఉ॥ ప్రసారము I

60.12 మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)

12-30* హైదరాబాద్ ఎ వలె
2-00 పి. కుప్పుస్వామి: వయొలిన్
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

3-30 హైదరాబాద్ ఎ వలె
4-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము
7-30 హైదరాబాద్ ఎ వలె
8-00 నాదస్వరం†
8-15 హైదరాబాద్ ఎ వలె
9-15 నాటిక
(విజయవాడనుండి రిలే)
9-30 హైదరాబాద్ ఎ వలె
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## బెంగుళూర్

491.8 మీ (610 కిలోసై)

ఉ॥ ప్రసారము I

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరణ
షేళగాన
7-15 జి.ఎన్.సుబ్రహ్మణ్యన్: వీణ
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లములో వార్తలు
8-15 గీతమంజరి: కన్నడ పాటలు
8-30* బజారుధరలు
8-35 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* వై.ఎన్. శ్రీనివాసమూర్తి
12-30 బాలజగత్
1-10 కన్నడమున వార్తలు
1-20 సి. నాగమణి:
కన్నడగీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 సి. నాగమణి: కన్నడగీతాలు
2-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లమున వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 సి. నాగమణి: కన్నడగీతాలు
6-20 సుగం సంగీత్†
6-35 ప్రదేశ సమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆర్. సుశీల
వాద్యబృందమునతో
8-30 Radio News Reel
(relay from Delhi)
8-40 వాద్య సంగీతం †
8-45 గానసుధ †
సాత్తూర్ ఎ.జి. సుబ్రహ్మణ్యం
8-55 Today in Parliament
(relay from Delhi)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మూరనేయ యోజనయల్లి
సమాజద స్వరూప
ప్రసంగము (కన్నడము)
కె. నరసింహమూర్తి
9-25 లలిత వాద్యసంగీతం
9-30 అఖిలభారత సంగీత
కార్యక్రమము
గజాననరావ్ జోషి:
వయొలిన్
(ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## తిరుచ్చి

319.1 మీ (940 కిలోసై)

ఉ॥ ప్రసారము I

6-45* మంగళగానం
6-50 భక్తి గీతాలు
7-00 వాద్య సంగీతం
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 కుంభకోణం
ఎస్. రామమూర్తి: వయొలిన్
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

1-00* భక్తిపాటలు:
శీర్కాళి ఎస్. తిరుజ్ఞానసంబంధం
1-20 పిల్లల కార్యక్రమము
(తమిళము)
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతం †
2-00 తమిళమున వార్తలు
2-10 కుంభకోణం
ఎస్. రామమూర్తి: వయొలిన్
2-45* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

4-45* వివిధ భారతి
5-45 సంగీత పాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 సంజీవి పర్వతం
నాటిక (తమిళము)
(మద్రాస్‌నుండి రిలే)
8-30 Radio News Reel
(relay from Delhi)
8-40 సంగీతమాల†
8-55 Today in Parliament
(relay from Delhi)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మద్రాస్ బి వలె
9-30 అఖిలభారత సంగీత
కార్యక్రమము
గజాననరావ్ జోషి:
వయొలిన్
(ఢిల్లీనుండి రిలే)
11-00* ప్రసార సమాప్తి

* సమయసూచన † గ్రామఫోన్ రికార్డు ‡ స్టూడియో రికార్డింగ్

శనివారం జూన్ 30
శక 1884 ఆషాఢ 9

## మద్రాస్ ఎ

ఉ॥ ప్రసారము I
416·7 మీ (720 కిలోసై)

6-45 మంగళగానము
6-50 తుదిప్పాడల్ గళ్
7-00 వాద్య సంగీతం
7-10 నేటికార్యక్రమ వివరణ. వాతావరణ సూచన (తమిళము)
7-15 తమిళమున వార్తలు
7-30* వాద్యమాధురి : పంచరాగ తాళ మాలిక పి. ఆర్. మణి‡
7-45 రేడియో శెయిదిమలర్ వార్తావాహిని (తమిళము)
8-00 మధురగీతం†
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
416·7 మీ (720 కిలోసై)

1-00* కదంబం†
1-30 గానమంజరి†
1-40 హిందీలో వార్తలు
1-50 గీతమంజరి†
2-00 తమిళమున వార్తలు
2-10 వయొలిన్ యుగళం : విలయవిద్వాంసులు
2-30 వి. జయలక్ష్మి
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
416 7 మీ (720 కిలోసై)

5-30* అలమేలూ పట్టాభిరామన్
6-05 ప్రాంతీయ శెయిదిగళ్
6-15 గ్రామస్థులకు (తమిళము) (తిరుచ్చినుండి రిలే) (7-00 నుండి 7-15 వరకు షార్ట్‌వేవ్‌పై కూడా)
7-15 తమిళమున వార్తలు
7-30* శాంతా పి. నాయర్
8-00 ఎ. ముత్తయ్య : వీణ
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీతం †
8-45 వాద్యగోష్ఠి
9-00 సంగీతామృతం‡ మయూరం ఎస్. రాజం
9-15 మధురగీతం†
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము వినాయకరావ్ పట్వర్ధన్ (ఢిల్లీనుండి రిలే)
11-00 వాతావరణ సూచన. ప్రసార సమాప్తి

## మద్రాస్ బి

ఉ॥ ప్రసారము I
211 3 మీ (1420 కిలోసై)
60 98 మీ (4920 కిలోసై)

6-45 మద్రాస్ ఎ వలె
7-00 తెలుగులో వార్తలు**
7-15 సుప్రభాతమ్ సంస్కృత కార్యక్రమము 'ముకుందమాల' పఠనం: రమాబాయి
7-30 మద్రాస్ ఎ వలె
7-45 మద్రాస్ ఎ వలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II
211·3 మీ 1420 కిలోసై)
49 30 మీ (6085 కిలోసై)

1-00* మద్రాస్ ఎ వలె
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 గీతమంజరి†
1-50 తెలుగులో వార్తలు **
2-00 మధురగీతము†
2-10 ముత్తుక్కువియల్ పిల్లలకు (తమిళము)
3-00 For Children Conducted by Uncle Handel
3-30 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III
211 3 మీ (1420 కిలోసై)
60·98 మీ (4920 కిలోసై)

5-30* పాశ్చాత్య సంగీతము†
5-50 స్థానిక ప్రకటనలు. వాణిజ్యవార్తలు (ఆంగ్లము)
6-00 ఆంగ్లమున వార్తలు
6-05 మద్రాస్ ఎ వలె
6-15 కార్యక్రమ వివరణ (తమిళము)
6-20 మణి కృష్ణమూర్తి : వయొలిన్
7-00 తెలుగులో వార్తలు **
7-15 సంగీతమాల†
7-30 నదిక్కాద నాటకం నాటిక (తమిళం) రచన : పునర్వసు

## విజయవాడ

ఉ॥ ప్రసారము I
357.1 మీ (840 కిలోసై)

6-30* శుభోదయం
6-35 భక్తిరంజని : అన్నమాచార్య కీర్తనలు ఓలేటి వెంకటేశ్వర్లు ఎమ్. వి. రమణమూర్తి డి. పాండురంగరాజు
6 55 ప్రసార విశేషాలు
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీతశిక్షణ
7-30 రామవరపు సుబ్బారావు: వీణ
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము (హైదరాబాద్ నుండి రిలే)
1-00 వనితావాణి స్త్రీల కార్యక్రమము ఒంటిగా ఉయ్యాల లూగితివా బసవరాజు గేయం ధ్రువతార సీరియల్ నాటిక పెద్దిభొట్ల సుబ్బరామయ్యకథకు రేడియో అనుసరణ: 'సత్య' భావుకుడు బసవరాజు రూపకము

8-00 మద్రాస్ ఎ వలె
8-30 ఎస్. కుప్పుస్వామి
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 The Storehouse of the Sea A programme on future Plans to encourage the International Study of the World's oceans
9-25 వాద్య సంగీతం †
9-30 పాశ్చాత్య సంగీతము† **
11-00 ప్రసార సమాప్తి

## మద్రాస్-సి

193.5 మీ (1550 కిలోసై)
వివిధ భారతి (రిలే)
(వివరాలు 52-వ పేజీలో)

* షార్ట్‌వేవ్‌పైకూడా
** మీడియంవేవ్‌పై మాత్రం

1-30 బృందగానం ‡
1-50 తెలుగులో వార్తలు
2-00 బొమ్మరిల్లు పిల్లల కార్యక్రమము
3-00 వాతావరణ సూచన, ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థుల కార్యక్రమము సమన్వయదృష్టి : గురునానక్ బుర్రకథ మార్కెట్ సమీక్ష ప్రకటనలు, ధరలు, వాతావరణం
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము ఫిల్మ్ సంగీతం † విశేషాలేమిటి చేయంగల విన్నపాలు
7-30 క్రీడారంగ సమీక్ష ఎమ్. జానకిరామయ్య
7-40 వాద్య సంగీతము †
7-45 నారి నాటిక (హిందీ)
8-00 బసవరాజు అప్పారావు గేయాలు : ఎన్.సి.వి. జగన్నాధాచార్యులు
8-15 Development forum ) discussion (relay from Delhi)
8-30 Radio News Reel (relay from Hyderabad)
8-40 విరామ సంగీతము
8-45 చెప్పుకోతగ్గ వార్తలు వార్తాసమీక్ష (హైదరాబాద్ నుండి రిలే)
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 నాకోసమైనా బ్రతకండి నాటిక రచన : సి. రామమోహనరావు పాల్గొనువారు: ఎమ్. నాగరత్నమ్మ ఎస్. గోపాలరత్నం కె. విజయసారథి ఎన్. సుబ్బారావు
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము వినాయకరావు పట్వర్ధన్ (ఢిల్లీనుండి రిలే)
11-00 *వాతావరణ సూచన, ప్రసార సమాప్తి


* సమయసూచన † గ్రామఫోన్ రికార్డ్ ‡ స్టూడియో రికార్డింగ్

ఆదివారం జూన్ 30

## హైదరాబాద్-ఎ

ప్రసారము I

405.4 మీ (740 కిలోసై)

6-30* సుప్రభాత్
6-35 భక్తిరంజని
(విజయవాడనుండి రిలే)
6-55 కార్యక్రమ వివరణ
7-00 తెలుగులో వార్తలు
7-15 సంగీత శిక్షణ
(విజయవాడనుండి రిలే)
7-30 విజయవాడవలె
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 హిందీలో వార్తలు
8-30 బృందగానము
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-30* కార్మికుల కార్యక్రమము
కావ్యపఠనము :
భాగవతమునుండి
వారం వాహిని
సినీగీతి†
1-00 వనితావాణి
(విజయవాడనుండి రిలే)
1-30 లలిత్ సంగీత్: సి. వరలక్ష్మి
1-45 విరామ సంగీతం
1-50 తెలుగులో వార్తలు
2-00 హైదరాబాద్ బి వలె
2-10 ఉర్దూలో వార్తలు
2-20 హైదరాబాద్ బి వలె
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

3-30 బాలానందము
పిల్లల కార్యక్రమము
4-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

6-00* స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయవార్తలు
6-15 నవరస్
ఉర్దూలో కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు
7-15 ప్రసంగం (ఉర్దూ)
7-25 శ్రోతలఉత్తరాలకు జవాబులు (ఉర్దూ)
7-30 ప్రసంగము
(విజయవాడనుండి రిలే)
7-40 Question Forum
8-00 హిందీ కావ్యమేఁ ప్రేమ్ కే వివిధ్ రూప్: విశ్వప్రేమ్
ప్రసంగం (హిందీ)
రామమూర్తి 'రేణు'
8-10 విరామ సంగీతము
8-15 State Development Forum
The Scope and Significance of the Scheme of Compulsory Primary Education
8-30 *Radio News Reel*
8-40 విరామ సంగీతము
8-45 చెప్పుకోతగ్గ వార్తలు
వార్తా సమీక్ష
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 ఉర్దూలో వార్తలు
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము
వినాయకరావ్ పట్వర్థన్
(ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## హైదరాబాద్-బి

మ॥ ప్రసారము I

60.12 మీ (4990 కిలోసై)

6-30* హైదరాబాద్ ఎ వలె
7-45 ప్రసార సమాప్తి

ప్రసారము I (తరువాయి)

49.02 మీ (6120 కిలోసై)

8-00 హైదరాబాద్ ఎ వలె
8-45 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

42.02 మీ (7140 కిలోసై)

12-30* హైదరాబాద్ ఎ వలె
2-00 టి.జి.ఎస్. వీరరాఘవాచారి
2-30* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

ప్రసారము III

3-30 హైదరాబాద్ ఎ వలె
4-00 ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము IV

60.12 మీ (4990 కిలోసై)

6-00* హైదరాబాద్ ఎ వలె
6-15 గ్రామస్థుల కార్యక్రమము
7-00 తెలుగులో వార్తలు
7-15 గ్రామస్థుల కార్యక్రమము
ఫిల్మ్‌గీతము†
విశేషాలేమిటి?
చేయంగల విన్నపాలు
7-30 హైదరాబాద్ ఎ వలె
8-00 బసవరాజు అప్పారావు గేయాలు
(విజయవాడనుండి రిలే)
8-15 హైదరాబాద్ ఎ వలె
9-15 నాటిక
(విజయవాడనుండి రిలే)
9-30 హైదరాబాద్ ఎ వలె
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## బెంగుళూర్

ప్రసారము I

491.8 మీ (610 కిలోసై)

7-00* సుప్రభాత
కార్యక్రమ వివరణ
మేళగాన
7-15 పద్మా శివరామ్ : వీణ
7-45 కన్నడమున వార్తలు
8-00 ఆంగ్లమున వార్తలు
8-15 సౌందరా కృష్ణమూర్తి : కన్నడ పాటలు
8-30* బజారు ధరలు
8-35 ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

12-00* ఎ. హెచ్. శ్రీనివాసమూర్తి
12-30 బాలజగత్
1-10 కన్నడమున వార్తలు
1-20 కె. పద్మ : కన్నడగీతాలు
1-30 ఆంగ్లమున వార్తలు
1-40 హిందీలో వార్తలు
1-50 కె. పద్మ : కన్నడగీతాలు
2-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

6-00 ఆంగ్లములో వార్తలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-10 కె. పద్మ : కన్నడగీతాలు
6-20 సుగమ్ సంగీత్†
6-35 ప్రదేశసమాచార
6-45 గ్రామస్థులకు
7-45 కన్నడమున వార్తలు
8-00 టి. ఆర్. శుభాంగి వాద్యబృందంసహా
8-30 Radio News Reel (relay from Delhi)
8-40 వాద్య సంగీతము†
8-45 గానసుధ†
ముసిరి సుబ్రహ్మణ్య అయ్యర్
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 మూరనేయ యోజనెయల్లి సమాజవాది స్వరూప అర్థనీతి
ప్రసంగం (కన్నడం)
హెచ్. సి. దాసప్ప
9-25 జలతరంగ్ †
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము
వినాయకరావ్ పట్వర్థన్
(ఢిల్లీనుండి రిలే)
11-00* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

## తిరుచ్చి

ప్రసారము I

319.1 మీ (940 కిలోసై)

6-45* మంగళగానము
6-50 భక్తిగీతాలు
7-00 వాద్యసంగీతము
7-10 కార్యక్రమ వివరణ
7-15 తమిళమున వార్తలు
7-30 నాగర్‌కోయిల్
ఎస్. అనంతలక్ష్మి: వయొలిన్
7-55 స్థానిక ప్రకటనలు (ఆంగ్లం)
8-00 ఆంగ్లమున వార్తలు
8-15* ప్రసార సమాప్తి

మ॥ ప్రసారము II

1-00* భక్తిపాటలు;
1-20 పిల్లలకు (తమిళము)
1-40 హిందీలో వార్తలు
1-50 గాత్ర సంగీతము†
2-00 తమిళమున వార్తలు
2-10 నాగర్‌కోయిల్
ఎస్. అనంతలక్ష్మి: వయొలిన్
2-45* వాతావరణ సూచన,
ప్రసార సమాప్తి

సా॥ ప్రసారము III

4-45* వివిధభారతి
5-45 సంగీతపాఠం
6-00 స్థానిక ప్రకటనలు
6-05 ప్రాంతీయ వార్తలు
6-15 గ్రామస్థులకు
7-15 తమిళమున వార్తలు
7-30 మద్రాస్ బి వలె
8-00 చిత్రగానం†
8-30 ఢిల్లీనుండి రిలే
8-40 సంగీతమాల †
9-00 ఆంగ్లమున వార్తలు
9-15 Medical Science on the march
Preventive Medicine
talk
9-30 అఖిలభారత సంగీత కార్యక్రమము
వినాయకరావ్ పట్వర్థన్
(ఢిల్లీనుండి రిలే)
11-00* ప్రసార సమాప్తి

---

* సమయసూచన    † గ్రామఫోన్ రికార్డు    ‡ స్టూడియో రికార్డింగ్

# ప్రసంగములు

## మద్రాస్

జూన్ 20 బు॥ రా॥ 7-45 సాంఘిక చట్టము సఫలమగుటకు
ఉపయోగించే పద్ధతు లెవ్వి ?**
(చర్చ)
వి. సరోజినీదేవి, వి. బాలసుబ్రహ్మణ్యం

.. 27 బు॥ రా॥ 7-45 పుస్తక పరిచయము** సమీక్ష
సి. రాధాకృష్ణశర్మ

23 గు॥ రా॥ 9-30 సమకాలీన సాహిత్య
కార్యక్రమము (తెలుగు)

## విజయవాడ

జూన్ 19 మం॥ సా॥ 6-15 ఈ శతాబ్ది పూర్వార్ధములో
దిగవంతులైన కొందరు కవులు,
సాహిత్య వేత్తలు :
వావిలికొలను సుబ్బారావు
అక్కిరాజు వెంకటేశ్వరశర్మ

.. 23 శు॥ రా॥ 7 30 నాకుతెలిసిన ముట్నూరి కృష్ణారావు
కొటూరి వెంకటేశ్వరరావు

.. 30 శు॥ రా॥ 7-30 క్రీడారంగ సమీక్ష
ఎమ్. జానకిరామయ్య

## హైదరాబాద్

జూన్ 17 ఆ॥ రా॥ 9-15 రాగలక్షణం : పూర్వి కల్యాణి
ఉదాహరణాత్మక ప్రసంగం
వింజమూరి వరదరాజ అయ్యంగార్

.. 18 సో॥ మ॥ 1-30 నేను కథ ఎలా వ్రాస్తాను ? గోష్ఠి
టి. గోపీచంద్, కె. కుటుంబరావు
పి. పద్మరాజు

.. 19 మం॥ సా॥ 6-30 స్వీయకవిత : శివశంకర స్వామి

.. 21 గు॥ రా॥ 7-30 సోషలిస్టు సంఘములో
సంస్కృతి
డా॥ వి. వి. రామనాధం

.. 24 ఆ॥ రా॥ 9-15 రాగలక్షణం : చక్రవాకం
వింజమూరి వరదరాజ అయ్యంగార్

.. 25 సో॥ రా॥ 9-45 అమరభారతి
మాగజైన్ కార్యక్రమం (సంస్కృతం)
సంపాదకులు :
కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

.. 27 బు॥ రా॥ 8-30 కొమర్రాజు లక్ష్మణరావు
ఆదిరాజు వీరభద్రరావు

# నాటికలు, రూపకములు

## మద్రాస్

జూన్ 18 సో॥ రా॥ 9-30 కిన్నెరసాని
సంగీత రూపకమ
రచన: విశ్వనాధ సత్యనారాయణ
సంగీతం: మల్లిక్
నిర్వహణ: శు

.. 21 గు॥ మ॥ 1-00 యశోద ఏకపాత్రాభినయం
రచన: జలసూత్రం రుక్మిణీనాధ శాస్త్రి

.. .. .. రా॥ 9-30 ఏకలవ్య
మాతృక: టి. పి. కైలాసం
తెలుగు: గోరాశాస్త్రి
నిర్వహణ: శు
[అఖిలభారత నాటక కార్యక్రమం]

.. 24 ఆ॥ మ॥ 3-00 పెద్ద మనుష్యులు హాస్యనాటిక

.. 25 సో॥ రా॥ 9-15 అత్త
తమిళమాతృక: పి. జి. ఎస్.
తెలుగుసేత: పి. ఆర్. శర్మ

.. 27 బు॥ రా॥ 7-30 భూశయనం**
(టాల్‌స్టాయ్ కథఆధారం)
రచన: ఎమ్. ఉమామహేశ్వరరావు

## విజయవాడ

జూన్ 16 శు॥ రా॥ 9-15 రామ్‌బాబు-దొరబాబు
రచన: సి.హెచ్.వి.ఆర్. సుబ్బరాయశాస్త్రి

.. 17 ఆ॥ మ॥ 3-00 హోనాజీబాల
తెలుగుసేత: వి. రాధాకృష్ణమూర్తి
నిర్వహణ : బందా కనకలింగేశ్వరరావు

.. 18 సో॥ రా॥ 9-15 యుగంధర- ఏకపాత్రాభినయం
సి. రామమోహనరావు

.. 21 గు॥ మ॥ 1-30 బాహుకుడు ఏకపాత్రాభినయం
ఆర్. ఆంజనేయులు

.. 22 శు॥ రా॥ 9-30 రావణ ఆశీర్వాదం
రచన: పాంచాలి

.. 30 శ॥ రా॥ 9 15 నాకోసమైనా బ్రతకండి
రచన: సి. రామమోహనరావు

## హైదరాబాద్

జూన్ 17 ఆ॥ సా॥ 6-15 వాసంత సమీరము
సంగీత రూపకం
రచన: యు. కృష్ణమూర్తి

.. 20 బు॥ రా॥ 8-00 అంతర్దశ
రచన: పి.ఎస్.పి. దీక్షితులు "ఉషశ్రీ"

.. 23 శ॥ రా॥ 9-15 మా ముట్నూరి రూపకం
రచన, నిర్వహణ : వి. సహజానంద

.. 27 బు॥ మ॥ 1-00 అందరూ ఉద్యోగులే
రచన: ఎన్. ఇందిరాదేవి

.. 29 శు॥ రా॥ 9-30 నాటక రంగ లక్ష్యం రూపకం
రచన, నిర్వహణ :
స్థానం నరసింహారావు

# సంగీత కచేరీలు

## మద్రాస్

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూన్ | 17 | ఆ॥ | మ॥ | 3-00 | మరుత్తువక్కుడి రాజగోపాల అయ్యర్ |
| | | | | | వి. సేతురామయ్య : వయొలిన్ |
| | | | | | మద్రాస్ ఎ. కణ్ణన్ : మృదంగం |
| .. | 18 | సో॥ | రా॥ | 9-30 | బూడలూర్ కృష్ణమూర్తిశాస్త్రి : గోటువాద్యం |
| | | | | | బి. కె. లక్ష్మి : వీణ |
| | | | | | కుచీంద్రం కృష్ణన్: మృదంగం |
| .. | 20 | బు॥ | రా॥ | 9-15 | ఎస్. మోహనరంగం : నాదస్వరం |
| .. | 22 | శు॥ | రా॥ | 7-30 | పాల్ఘాట్ కె.వి. నారాయణస్వామి |
| | | | | | ఎమ్. చంద్రశేఖరన్ : వయొలిన్ |
| | | | | | ఉమయాల్పురం కె. శివరామన్ : మృదంగం |
| .. | 24 | ఆ॥ | ఉ॥ | 8-15 | వైరమంగళం లక్ష్మీనారాయణన్ |
| | | | | | తిరువళ్లూర్ వీరరాఘవన్ : వయొలిన్ |
| | | | | | ఎమ్. ఆర్. గణేశన్ : మృదంగం |
| .. | 25 | సో॥ | రా॥ | 9-30 | శేర్మాదేవి ఎల్. సుబ్రహ్మణ్య శాస్త్రి : వీణ |
| | | | | | శేర్మాదేవి ఎస్. వెంకటరామన్: వీణ |
| | | | | | కుచీంద్రం కృష్ణన్ : మృదంగం |
| .. | 28 | గు॥ | రా॥ | 7-45 | రాగం, తానం, పల్లవి |
| | | | | | సంధ్యావందనం శ్రీనివాసరావు |
| .. | 29 | శు॥ | రా॥ | 7-30 | గాన ముక్తావళి |
| | | | | | రికార్డులతో కూర్పు |

## విజయవాడ

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూన్ | 16 | శ॥ | ఉ॥ / రా॥ | 7-30 / 8-00 | విదాఘూటం శ్రీ రామకృష్ణశాస్త్రి: వయొలిన్ |
| .. | 17 | ఆ॥ | రా॥ | 8-00 | బలిజేపల్లి రామకృష్ణ |
| | | | | | అన్నవరపు రామస్వామి : వయొలిన్ |
| | | | | | యెల్లా సోమన్న: మృదంగం |
| .. | 22 | శు॥ | రా॥ | 9-15 | వాసా కృష్ణమూర్తి : వీణ |
| .. | 24 | ఆ॥ | రా॥ | 8-00 | సుందరపల్లి సూర్యనారాయణ మూర్తి: క్లారినెట్ |
| | | | | | డి. పాండురంగరాజు : వయొలిన్ |
| | | | | | డి. రామమోహనరావు: మృదంగం |
| .. | 25 | సో॥ | రా॥ | 7-30 | ఎ. వి. ఎస్. కృష్ణారావు |
| | | | | | అన్నవరపు రామస్వామి : వయొలిన్ |
| | | | | | డి. రామమోహనరావు: మృదంగం |
| | | | | | ఎ. గోపాలం : ఘటం |

## హైదరాబాద్

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూన్ | 17 | ఆ॥ | ఉ॥ | 8-30 | మాలతీ పద్మనాభరావు |
| | | | | | పి. కుప్పుస్వామి : వయొలిన్ |
| | | | | | వి. ఎస్. లక్ష్మీనారాయణన్ : మృదంగం |
| .. | 22 | శు॥ | రా॥ | 9-15 | మనక్కాల్ వరదరాజన్ |
| .. | 24 | ఆ॥ | ఉ॥ | 8-30 | వి. అంకయ్య |
| .. | .. | .. | .. | 10-00 | హిందూస్థానీ సంగీత సభ |
| | | | | | మానిక్ వర్మ : గాత్రం |
| | | | | | డి. ఎమ్. టాగూర్ : తరిత్‌వీణ (ఆహూతుల సమక్షమున) |
| .. | 29 | శు॥ | రా॥ | 9-45 | పర్వతనేని వీరయ్యచౌదరి |
| | | | | | ఎస్. ఎల్. ఎన్. శాస్త్రి : వయొలిన్ |
| | | | | | అట్లూరి వెంకటేశ్వరరావు : మృదంగం |

## బెంగుళూర్

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూన్ | 17 | ఆ॥ | ఉ॥ | 8-30 | వి. ఎన్. రావు : వీణ |
| | | | | | ఎమ్. ఎస్. రామయ్య : మృదంగం |
| .. | 18 | సో॥ | రా॥ | 8-15 | టి. కె. రంగాచారి |
| .. | 19 | మం॥ | రా॥ | 9-30 | చింతలపల్లి రామచంద్రరావు |
| .. | 20 | బు॥ | రా॥ | 8-15 | టి. పుట్టస్వామయ్య |
| .. | 23 | శ॥ | రా॥ | 8-00 | రాజమ్మా సి. ఆర్. గౌడ |
| .. | 24 | ఆ॥ | ఉ॥ | 8-30 | జి. ఆర్. దాసప్ప |
| .. | 25 | సో॥ | రా॥ | 8-15 | బి. వి. సీత |
| .. | 27 | బు॥ | రా॥ | 8-15 | మైసూర్ వి. దొరస్వామి అయ్యంగార్ ; వీణ |
| | | | | | టి. పుట్టస్వామయ్య : మృదంగం |

## తిరుచ్చి

| | | | | | |
|---|---|---|---|---|---|
| జూన్ | 17 | ఆ॥ | ఉ॥ | 8-15 | ఇంజకుడి పిచ్చైకణ్ణు సోదరులు : నాదస్వరం |
| .. | .. | .. | రా॥ | 7-30 | శారదా నటరాజన్ |
| .. | 19 | మం॥ | రా॥ | 7-45 | ఎమ్. రామచంద్రశాస్త్రి: వేణువు |
| .. | 21 | గు॥ | రా॥ | 7-15 | తిరువారూర్ వి. నమశ్శివాయం |
| | | | | | రాగం, తానం, పల్లవి |
| .. | 2[illegible] | సో॥ | రా॥ | 9-30 | మన విశా పాడకోగళ్ : సీతాకల్యాణం |
| | | | | | సమర్పణ : కె. సి. త్యాగరాజన్ |
| .. | 26 | మం॥ | రా॥ | 7-45 | టి. కె. రంగాచారి |

# జీవము - భూమిపై దాని ఉత్పత్తి

వి. వి. ఆర్. కృష్ణమూర్తి

శాస్త్రజ్ఞుల అంచనాల ననుసరించి మన భూమి ఏర్పడి, సుమారు మూడు వందలకోట్ల సంవత్సరాలయిందని, ఇప్పటికి సుమారు వంద కోట్ల సంవత్సరాలనుంచి మన భూమి పై జీవరాసు లున్నట్టూ తెలుస్తున్నది. ఇప్పుడు మనకు కనబడుతూ ఉన్న అనేక రకాలయిన చెట్లు, జంతువులు మొట్టమొదట, అతి సామాన్యమైన సూక్ష్మజీవులనుండి ఉద్భవించిన వనిన్నీ, ఆ సూక్ష్మజీవులే క్రమ క్రమంగా మార్పు చెందడంవలన ఇన్ని రకాల చెట్లూ, జంతువులూ భూమిపై అవతరించినాయనిన్నీ జీవ పరిణామ సిద్ధాంతం చెప్తుంది. అయితే వందకోట్ల సంవత్సరాలకు పూర్వం ఈ చెప్పిన సూక్ష్మజీవులు ఎలా వచ్చాయి? అన్న ప్రశ్న ఇంతవరకూ పూర్తిగా నిర్ధారణ చేయబడలేదు. అంటేభూమిపై. జీవం మొట్టమొదట ఎలా ఉద్భవించినది? అన్న సమస్య పూర్తిగా పరిష్కరింపబడలేదు.



''అడసీసుక్కాని యీడనేగెడయేసి వడవెక్కి బద్రాద్రి పోదామా?''

చిత్రకారుడు — మారేమండ రామారావు

ముందుగా జీవం అంటే ఏమిటో మనము తెలుసుకొందాము.

జీవలక్షణాలు ముఖ్యంగా ఇలా ఉంటాయి. జీవు లన్నింటిలోనూ ప్రోటోప్లాజము అనే చిక్కటి ద్రవ పదార్థము ఉంటుంది. ఇదే జీవము యొక్క భౌతికరూపము లేక ఆకారము. ఇది జీవు లన్నింటిలోనూ ''కణములు'' అనే చిన్నచిన్న గదులలో ఉంటుంది. రెండవ లక్షణము ప్రేరణకు ప్రతిక్రియ చూపుట, అంటే శీతోష్ణములు, కాంతి, విద్యుచ్ఛక్తి రసాయనిక పదార్థములు మొదలైన వాటిచే కలుగు ప్రేరణకు జీవులు ప్రతిక్రియ చూపుతాయి. మూడవ లక్షణము, జీవ క్రియలను చేయ గలుగుట. ఆహారమును తీసుకొని జీర్ణము చేసుకొనుట. శ్వాసక్రియ, మలిన పదార్థములను విసర్జించుట మొదలయినవి. ఈ జీవక్రియలవలన జీవి శరీరములో క్రొత్త ప్రోటోప్లాజము తయారయి దానినుండి శక్తి ఉద్భవిస్తుంది. ఈ శక్తి జీవుల దైనందిన కార్యక్రమాలకు ఉపయోగపడుతుంది. ఈ జీవక్రియలలో అనేక రసాయనిక మార్పులు నిరంతరము జరుగుతూనే ఉంటాయి. నాల్గవ జీవలక్షణము, పెరుగుదల, అయిదవది చలనము. ఆరవది సంతానోత్పత్తి. ఈ సంతానోత్పత్తి వలన జీవులు తమ సంఖ్య నభివృద్ధి చేసుకొంటాయి. ఇది జీవుల అతి ముఖ్య లక్షణము.

అసలు సుమారు మూడు శతాబ్దాల పూర్వం వరకూ పాశ్చాత్యులలో ఒక మూఢనమ్మక ముండేది. జీవు లన్నీ జీవములేని జడపదార్థముల నుండి పుట్టుతాయని వారు నమ్మేవారు. మట్టిలోనుంచి వానపాములు, నీటిపై తేలే సున్నంలోనుంచి కప్పలు, నిలవవున్న మాంసంలోనుంచి ఈగలు పుడతాయని తలచేవారు, కొంతకాలానికి Spall nzini Pasteur మొదలైన శాస్త్రజ్ఞులు ఈ నమ్మకం పూర్తిగా తప్పనీ, ఈ జీవు లన్నీ సామాన్యంగా కంటికి కనపడనటువంటి సూక్ష్మమైన గ్రుడ్లనుండి మాత్రమే జనించగలవని ప్రయోగ రీత్యా నిరూపించారు.

భూమిపై జీవోత్పత్తిని గూర్చి ప్రతిపాదించిన సిద్ధాంతము లన్నింటిలోకీ రష్యను శాస్త్రజ్ఞుడైన ఒఫేరిన్ ప్రతిపాదించిన సిద్ధాంతము చాలా వరకు విశ్వసనీయంగా ఉంటుంది. భూమి ఏర్పడిన తరువాత మొదటి రెండువందల కోట్ల సంవత్సరాల కాలంలో సముద్రాలలో జరిగిన అనేక రసాయక మార్పుల ఫలితంగా జీవము ఉత్పత్తి అయిందని, ఈ సిద్ధాంతంయొక్క సారాంశము. ఈ సిద్ధాంతం అర్థం చేసుకొనేముందు. భూమి ఏర్పడినప్పటి దాని పరిస్థితు లన్నింటినీ క్షుణ్ణంగా తెలుసుకోవాలి. భూమి ఏర్పడిన తరువాత చాలా కాలంవరకూ అది ఒక ద్రవగోళంగా ఉండి ఇప్పటికన్న ఎన్నోరెట్లని వేడిని కలిగియుండేది.

ఈ ద్రవగోళంచుట్టూ ఒక వాయు పొర కవచంలా ఉండేది. వాతావరణంలో ఆక్సిజని లేదు. ఉదజని,

హీలియం, మీథేను అను వాయువులు ఉండేవి. క్రమంగా ఈ ద్రవగోళం చల్లారడంతో, దాని ఉపరి భాగం చల్లారి, ఘనీభవించి, శిలారూపమైన పై పొరగా మారినది. ఈ పొరనుండి నత్రజని, కర్బన ద్వి ఆక్సిజని, (బొగ్గుపులుసువాయువు) నీటి ఆవిరి పైకివచ్చి వాతావరణాన్ని ఆక్రమించాయి. భూగోళం మరి కొంత చల్లాంతో [illegible]రణం చల్లారి, నీటిఆవిరి నీటిబిందువులుగా మారినది. ఆ నీటిబిందువులు వర్షరూపంలో భూమిపై పడినవి. ఈ విధంగా కొన్నివేల సంవత్సరాలు ఏకధాటిగ వర్షాలు పడడంచేత, భూమిపై పడిన నీరు పల్లపు ప్రదేశాలకు చేరి పెద్ద పెద్ద సముద్రాలు ఏర్పడినాయి. ఈ వర్షాలవలన గాలిలోని కర్బనద్విఆక్సిజని భూమిపైనుండి ఉబికి వచ్చే కొన్ని నత్రజని సంబంధమైన లవణాలు సముద్రాలను చేరినాయి, ఇక అగ్నిపర్వతములు బ్రద్దలైనప్పుడు వెలికి చిమ్మబడిన లావాలో కార్బైడులు అనే రసాయనిక పదార్థాలుండేవి. ఈ కార్బైడులనుండియే హైడ్రోకార్బనులు అమోనియా తయారైనవి, పీటినుండి తరువాత అమైనో అమ్లములు తయారైనవని. ఈ అమైనో అమ్లములు తయారు కావడానికి అవసరమైన రెండు శక్తులు అప్పట్లో ఉండేవి. మొదటిది అల్ట్రావైలటు కిరణాల శక్తి. రెండవది మెరుపువలన ఉత్పన్నమయిన విద్యుచ్ఛక్తి.

భూమిఏర్పడిన చాలాకాలంవరకూ భూమిలో ప్రసరించే సూర్యరశ్మిలో అల్ట్రావైలట్ కిరణాలు అతి ఎక్కువగా ఉండేవి. ఈ కిరణాలు నీటిని అమోనియాను, హైడ్రోకార్బనులను సంఘటిత పరచి, వాటినుండి అమైనో అమ్లములను తయారు చేసినవని. ఇక విద్యుచ్ఛక్తి కూడ అమైనో అమ్లములు తయారవడానికి ఎక్కువగా సహాయకారి అయినది. ఈ విధముగా మొట్టమొదట సముద్రాలలో అమైనో అమ్లములు ఏర్పడి ప్రోటీన్ల నిర్మాణానికి తరువాత జీవోత్పత్తికి నాంది జరిగినది. జీవోత్పత్తికి పూర్వం కోట్లకొలది సంవత్సరాలలో జరిగిన ఈ రసాయనిక మార్పులకే "రసాయనిక పరిణామము" అని పేరు.

నేడు శాస్త్రజ్ఞులు వైరసులు అనే విచిత్రమైన జీవులనుకనుగొన్నారు. ఇవి ఇతర జీవుల శరీరాలలో నున్నపుడు జీవులవలె, సంతానోత్పత్తిని జీవక్రియలను చేయగలవు. ఇతర జీవుల శరీరాలలో లేకుండా బయట వున్నపుడు ఇవి తమ జీవక్రియలనన్నిటినీ విడచి, గుమిగూడి, స్పటికములుగా తయారవుతాయి. అంటే ఆ స్థితిలో అవి రసాయనిక పదార్థములుగను, మరికొన్ని పరిస్థితులలో నిర్జీవ పదార్థముగను ఉంటాయి, అందుకే శాస్త్రజ్ఞులు నిర్జీవ పదార్థములనుండి జీవము ఉద్భవించుటకు ముందు ఈ వైరసులు బహుశా ఉద్భవించి ఉండునని నిర్ణయించారు.

మొట్టమొదట ఉద్భవించిన జీవులు సముద్రంలోనే ఉండేవి. ఎందుచేతనంటే భూమిపై అల్ట్రావైలట్ కిరణాల ప్రభావం ఎక్కువగా ఉండేది. కాలక్రమేణా ఈ అల్ట్రావైలట్ కిరణాల ప్రసారం తగ్గిన తరువాత సముద్రాలనుండి జీవులు నేలపైకికూడా వ్యాపించి నేడు మనకు గోచరిస్తున్న అనేక రకాల జంతువులు చెట్లుగా రూపొందినవి.

ఇంకొక ముఖ్యవిషయం ఇక్కడ గమనించాలి. "జీవము" అంటే ప్రోటోప్లాజములో కొన్ని వేల రసాయనిక మార్పులు ఎంతో పొందికతో అనుబంధంతో కాలక్రమ నిర్ణయాలలో జరగడమేకాక, ఆ మార్పులన్నింటికీ ఒక "లక్ష్యము" కలిగి, తనలో ఉండే జీవశక్తి నిరంతరాయంగా ప్రవహిస్తూ, తనలోనుండి కొత్తజీవులు ఉద్భవించాలన్నదే జీవముయొక్క ఏకైక లక్ష్యము. ఈ లక్ష్యప్రధానమైన గుణము ఏ ఇతర రసాయనిక పదార్థములోనూ లేదు. అంటే ఏ ఇతర రసాయనిక పదార్థములోనూ లేని ఒక అద్భుత శక్తి జీవములో ఉందన్నమాట.

జీవోత్పత్తికి ముందు భూమిపై గల భౌతిక భౌగోళిక వాతావరణ పరిస్థితులన్నీ పూర్తిగ తెలిసిన నాడు ప్రయోగశాలలో జీవము నుత్పత్తి చేయవచ్చునని శాస్త్రజ్ఞుల నమ్మకం. మానవుని రోదసీ యాత్రగూడ భూమిపై జీవోత్పత్తికి సంబంధించిన కొన్ని చిక్కుసమస్యలను విడగొట్టగలదు. విశ్వంలో ఎక్కడో అక్కడ జీవముయొక్క ప్రథమ దశలవంటివి ఉండి ఉంటాయని శాస్త్రజ్ఞుల నమ్మకము. మానవుడు ప్రయోగశాలలో జీవము నుత్పత్తి చేయగలిగిననాడు బాధను, జబ్బులను జయించిన మానవుని మేధస్సుకు అఖండ విజయ కలిగినట్లే.

వైరసులను, కేన్సరును రూపుమాపి మృత్యువును జయించిన వాడవుతాడు. రోదసిని భేదించి, విశ్వంలో వీరవిహారం చేయగల్గిన మానవుడు, సూక్ష్మాతి సూక్ష్మమైన అణువును విడగొట్టగలిగిన మానవుడు మృత్యుకవాటాన్ని శాశ్వతంగామూసివేస్తాడు.

శ్రద్ధాంజలి :

## మృదంగ విద్వాన్ పళని సుబ్రహ్మణ్య పిళ్లై



సుప్రసిద్ధ మృదంగ విద్వాంసులు పళని సుబ్రహ్మణ్య పిళ్లైగారు, మే నెల 27-వ తేదీన కాలధర్మ చెందారు. ఈయన వయసు 53 సం.

కర్ణాటక సంగీత ప్రపంచమున, మార్దంగికులలో, అగ్రశ్రేణికి చెందినవారు ఈయన. తన అగ్రశ్రేణి స్థానమును మూడు దశాబ్దముల పాటు వీరు పాలించిరి. ఉన్నతమూ, పూజ్యమూ అయిన పుదుక్కోట మాన్పూండియా పిళ్ళగారి సంప్రదాయమునకు చెందినవా రీయన. పుదుక్కోట దక్షిణామూర్తి పిళ్లైకు శిష్యులు. ఈయన బాల్యవిద్యను తన తండ్రి పళని ముత్తయా పిళ్లైగారివద్దనే నేర్చెను. వీరిది విద్వత్కుటుంబము.

పళని సుబ్రహ్మణ్య పిళ్లై రూపొందించిన వాద్యపద్ధతిలో నిర్దుష్టమైన వ్యక్తిత్వమూ, ఒక విధమైన లాలిత్యమూ ఉట్టిపడుతూ ఉండేవి ఈ పద్ధతి అతి మృదువు అతిమధురము అయినది. తన వాద్యమయిన మృదంగమును పిళ్లైగారు మాతృమూర్తి తన బిడ్డను చూచినట్లుగా చూచుకొనేవారు. ఎంతో నిగ్రహం కలిగిన వాద్యకుడీయన. కర్ణాటక సంగీతం ఆడిషన్ బోర్డులో వీరు సభ్యులుగా వుండిరి. ఈయన మృతితో కర్ణాటక సంగీత ప్రపంచం—సమర్థుడు, విద్యా సంపన్నుడు అయిన గొప్ప విద్వాంసుని పోగొట్టుకొన్నది.

# తాన ప్రశంస

## సంప్రదాయము పరిశీలన

ప్రీణదు తాన మనునది ప్రత్యేకాంశమై యున్నది. 'తానం' అనగా తడ, మీటుల కలయికతో స్వరములను విస్తరింపజేయుట అని యర్థము. 'త-అనం' అనునపుడు 'త' మీటు 'అ' తాళమును, 'నం' అనునపుడు మీటునుచేర్చి తానము వాయించుట పూర్వమునుండి సంప్రదాయముగ వచ్చుచున్నది. పూర్వాచార్యులు తానము నేర్పునపుడు తానాయత్తములను అనగా చిట్టతానములను స్వరపరిచి నాట, గౌళ, ఆరభి వరాళి శ్రీరాగము మొదలగు ఘనరాగములయందు తానములను శిష్యులకు చెప్పెడువారు. పై నుదహరించిన, ఐదు ఘన రాగములలో వాయించెడి తానములను 'ఘన రాగ పంచక'మందురు. తానమందు రెండు విధములగు తానములుగలవు. 1 తడమీటు తానము. 2 జోడుమీటు తానము. తడమీటు తానము పైనుదహరించిన ప్రకారముగా నుండును. జోడుమీటు తానమనగా, మీటును తానమును ఒకేసారి వేయుచూ సర్వలఘు స్వరములు ఎక్కువగా ప్రస్తారం చేయబడుచుండును. దురిత కాల ము పలుకుటపై ఈ జోడు మీటు తానమును పూర్వము వైణికులు ఎక్కువగా వాయించెడి వారు. ఇందు ప్రస్తుతము తడమీటు తానమే వాయిపయందు గలదు. మగమరిరిస పై పద్ధతిని అద్వితీత ముఖ్యముగా తానము వాయించు మీటుగనూ, అర్థచంద్రావృతి తాళ నపుడు మీటునుపట్టి మీటవలెను. ముగను గుర్తైయుంగ వలెను. ఈ సా సా రి రి సా అని మీటిన పద్ధతిని ఏ రాగమందైనను ముంమీటునువదలి మీటు వేయునియు దు ఈ జాతులను స్వరప్రకార అదే స్వరమును చూపుడు వ్రేలు ముగ వాయించిన తరువాత మనోతో 'స' మీటి రెండవ వ్రేలుతో ధర్మ తానము వాయించవచ్చును. నాదమును నొక్కిపట్టి స్స యని తానము వాయించు నపుడు పడి మీటిన 'సస్స' యగును. ఇదే చేతిమీటును, ఎడమచేతిలో మెట్ల పద్ధతిని మీటిన 'రిరిసా', 'రిరిసా' పై వాయించి ఒక మీటు యగును. 'సస్స రిరిసా' యను ఈ రెండు స్వరములు చొప్పున స్వరమును గమకము తోను, ఎట్టి ప్రస్తారములనైనునూ క్రమం స్ఫురిత ప్రత్యాఘాతముల తోను తప్పక వాయించుట వైణిక సంగూడ వాయించుటకలదు. ఇందు ప్రదాయము, ఇది తానమును దాటు స్వరములు—రి స రి ప మ తడ అనగా తాళము లేకుండ ని ప స ని రి స నీ స ప రి స పా స ని ప సాహిత్యపు మీటు పద్ధతిని 'ప' అనియూ, రి రి స స స ని ని ని ప మీటును 'మ' అకారముగా వా ప ప మ, త్రిశ్రజాతిని గమకము యుంచ వలెను. దీనినే తడగా తోగాని, స్ఫురిత ప్రత్యాఘాతము వాయించునపుడు అకార స్వరము లతోగాని ఇట్లు వాయించవలెను. వద్ద తాళము పడును. పమ గమ తానమును మనోధర్మ పద్ధతిని అని వాయించు నపుడు మీటును గూడ వాయించ వచ్చును. ఉదా పట్టియే మీటవలెను. మీటును హారణ—తకిట॥ కిటతక॥ దధి పట్టుట అనగా 'ప'నుండి వచ్చెడి గిణత॥ తక వధిగిణత॥ కిటతకదధి కంపనమును మూసి మ మీటుయే గిణత॥ రిరిస॥ నిసరిస॥గమరిరిస పట్టి మీటుట యగును, అలాగు పమగమరిరిస॥ పనిపమగమరి ననే స్వరము వేయునపుడు, సరి రిస॥ అను ఈ 5 జాతులను తడ మ సనిస రిసని పనిస పట్టి మీటు పద్ధతిని, రిరిస, నిసరిస, వాయించుట, అదే స్వరమును గమరిరిస, పమగమరిరిస, పనిప వదలి వాయించుట....వీణపై వా

ద్యంతో పట్టి వాయించిన ప్రతి స్వరమునందును ఒక స్పష్టత, నిర్దుష్టత గలదు. వీణావాద్యము ఏ భావములతో వాయించినను అన్నింటికిపట్టి మీటుటయే మూల సూత్రమై యున్నది. ఇక తానమును వాయించునపుడు 1 మంద్ర, 2 మధ్యమ, 3 తారస్థాయి లందు ఏ స్థాయికా స్థాయియందు ప్రస్తారము చేయుచు, జంట, దీర్ఘాక్షరములను తరచు వేయుచుండవలెను. కాలమును నెమ్మదిగ హెచ్చుచేయుటయే తానమునకు సంప్రదాయమై యున్నది. పోగా ప్రక్క తీగెలు మీటకుండగూడ తానము వాయించుట గలదు, ఇట్లు వాయించునపుడు కుడియెడమల కలయికలు ఒకే విధంగా యుంటూ, ఏ ప్రస్తారమునకా స్వర ప్రస్తారము క్రమము తప్పక పఘులముగా యుండును, తాన ప్రస్తారములయందు, (గౌళ)-సని రిస రిని సని రిస రిసాసా, నిప సని సప నిప సని సని నీనీ, పమ నిప నిమ పమని పని మపాపా, మరి పమ పరి మరి పమ పరి మామా రిస మరి మస రిస మరి మస రీరీ ఈ విధమగు సందర్భానుసారమైన స్వరప్రస్తారములతోనూ, త్రిశ్రము, ఖండము-మరియు ఖండము సంకీర్ణము-చతురశ్రము, మిశ్రము రెండేసి జాతులను చేర్చి వాయిం

చవలెను. తానం వాయించునపుడు—సరిసనీసని సనిసరిస నీసప నిపనిస నిపా నిమ రిరి సరిసస నిస నిప నిపపమ— అడు మీటుతోనూ, మగమరిరి ససని మరిపమ నిపసని రిస నీసపనిసనీస రిసమరిస నీసప నిసనీసపనిస నీస నిసరిస్సా. రిమ పమా పరి మప మా పని పనిప్పా. పని సనీ సప నిస నీస నిసరిస్సా. ఈ విధముగా స్వరము వేసినపుడు ముక్తాయి వేసిన పద్ధతిని తానాంతమున వేయవచ్చును. ఈ తానములతో 1 నాగబంధ తానము, 2 చక్ర బంధ తానము, 3 కోలాహలతానము అను మరి మూడు విధములగు తానములు గలవు. ఇందు నాగబంధ తానము అనగా మంద్ర షడ్జమంనుండి, మధ్యమంవరకూ ప్రస్తారములు చేయుచూ వాయించే తానము నాగబంధ తానము. చక్ర బంధ తానమనగా తానం వాయిస్తూ సరి మప నిస నిప, సరి పమ గమ రిరి సని, అనే ఈ స్వరమునందు. పని సనిప, అనే స్వరము ప స్వరమునందు గమకముతో వాయించ వలెను. ఇక సరిప మగమ, అనే స్వరమును పంచమం తీగెలో రిషభమందు గమకముతోలాగి వాయించ వలెను. ఇటులతాన ప్రస్తారములు చేయుచూ సారిణీ తీగెనుండి పంచమంతీగె, మందరం తీగె ఈ మూడు తీగెలపై ప్రస్తారము చేయుచుండవలెను. ఇక కోలాహల తానమనగా సారిణీ, పంచమం, మందరం, అనుమందరం తీగెలు నాల్గింటిని తానం మీట్లతో మీటుచూ సారిణీ తీగెపై తాన ప్రస్తారము చేయవలెను. ఈ మన తాన సంప్రదాయమునే హిందుస్థానీ సంగీతమందు ఆలాన్, జోర్, ఝలా అని అందురు. వీటిని ఉత్తరాది సితార్ విద్వాంసులు సితార్‌పై వాయించుట సంప్రదాయమై యున్నది. ఇక దురిత కాలములో తానము వాయించునపుడు జారు, సుకవు, ప్రత్యాఘాతములతో వాయించుటగలదు.

తానంబులు వారివారి ప్రజ్ఞా విశేషములబట్టి ప్రకర్షతాయుక్తంబుగా నుండగలవు. పూర్వీకులలో మహావైణిక శిఖామణులు తానఆయత్తములను చేసి, వాయించి, పలువురు శిష్యులకు చెప్పి, ఈతానము ఎప్పటికిని చిరస్థాయిగా నుండునట్లు చేసిరి. మన వైణిక శ్రేష్ఠులలో అఖండమైన కీర్తిగాంచిన గోమఠం దీనయ్య, వాసా అప్పయ్య, కలికొట్ల కామరాజు, రంగుల సరవప్ప, గుమ్మలూరి వెంకటశాస్త్రి, తుమురాడ సంగమేశ్వర శాస్త్రి, ఈమని సుబ్బన్న, అచ్యుతరామ శాస్త్రి, గురాచార్యుల వెంకటరమణయ్య, పేరిరామమూర్తి, దూర్వాసుల సూర్యనారాయణ సోమయాజులు, ములుగు శివానందశాస్త్రి మొదలగు వారున్నూ.

దాక్షిణాత్య వైణిక విద్వాంసులలో— వీణం శేషన్న, వీణధనం, దేశమంగళం సుబ్రహ్మణ్యయ్యర్, కారక్కుడి సాంబశివయ్యర్, మైసూర్ వెంకటగిరప్ప. మొదలగు వారున్నూ వీణయందపార కృషిచేసి, అనేకుల మన్ననలను బడసి వీణకు ఆదర్శప్రాయులై తరించిరి.

శ్లో॥ వీణావాదనతత్త్వజ్ఞః
శృతిజాతి విశారదః
తాళజ్ఞశ్చాప్రయాసేన
మోక్షమార్గం సగచ్ఛతి.

వీణా వాదనమందు స్వభావము నెరిగినవాడునూ, శృతిజాతులు విచక్షణయూ, తాళమును దెలిసిన వాడుగా నెవడున్నాడో వాడు ప్రయాసములేకయే మోక్షమును బొందుచున్నాడు. అని యాజ్ఞవల్క్య స్మృతియందు చెప్పబడి యున్నది. వీణకు తానమునది యొక ప్రాణము.


చెదిరిన మనము      చిత్రకారుడు: పి.హెచ్. ఎమ్. కృష్ణారావు

(3-వ పుట తరువాయి)

నీ నవపల్లవోదమము నిస్తుల పుష్పరజోమహంబులున్
తానొక లెక్కసేయక పదంబడి నేర్చిన మాటలాడి యు
ద్యాన జనాళికంట బడ కగ్గన పండులమెక్కి డుల్చి యెం
దేని జనున్ గదే శుక మదెంతటి వన్నియనీకు గూర్చురా.

రంజిత పల్లవంబు సుదరంభరినై నిను వేడలేదు శ్రీ
మంజులమైన దేశమున మార్దవమార్ద్రహృదంతరంబునై
రంజనగొన్న యాప్రణయిరక్తిని శాంతికి సాధనంబుగా
మంజుకుహూకుహూ ధ్వనుల మక్కువ గూర్చెడు సార్థకుండరా.

—కేశవపంతుల నరసింహశాస్త్రి

## నవవహానవతా వసంతం

వసంతం వస్తే-ప్రకృతి వసంతా లాడుకుంటుందట,
కిసలయాల గెంపులతో తీవెలు పసిడిదీపాలు వెలిగించుకుంటాయట,
బిసరుహనేత్రల చూపులలో వాడి బుసలు కొడుతుందట,
పసి మనసులలో పైడిమువ్వలు-పాటలల్లు తాయట !

వసంతం వస్తే-మావి మోవి త్రోవులలో మదిర బుసబుసా పొంగుతుందట,
కొసరి కొసరి కోయిల వినిచే కుహూరావాల గర్భంలో
నసాళానికంటే కషాయగంధ మెదో నలుదిక్కుల క్రమ్ముకుంటుందట,
పసులెత్తిన జాజి జవరాల పూలమేల్ముసుగు సవదరించుకుంటుందట !

వసంతం వస్తే-వేడిగాలికి ఒడిలో మంచుకొండ వాలుగా పైకి మొలుస్తుందట,
విసవిసానడిచే పయ్యెర అడుగులపడి ఇసుకలో కూరుకొనిపోతుందట,
అసలు సిసలైన మత్తుతో తెమ్మెర దిసంతులు కూడుతుందట,
ఉసూరుమంటూ యీడిగిలబడి పవమానం ఊర్పులలో వలపు లూరిస్తుందట !

వసంతం వస్తే-ప్రకృతి పురుషులు రసపరవశు లవుతారట,
అసమాస్త్రుడు చిలుకనెక్కి ఆహవసన్నాహం చేస్తాడట,
మిసమిసలాడే వనపంక్తిలో జవ్వనం మెల్లగా మేలుకుంటుందట,
పసులకాపరి పిల్లనగ్రోవిలో రాగం దిసమొలతో దివ్యనృత్యం చేస్తుందట !

వసంతంవస్తే-ఒడలు పులకరిస్తుందట, ఎడద చివురిస్తుందట !
వసంతంవస్తే-కనుపాప మిలమిలలాడుతుందట, పలుకు తేనె లొలుకుతుందట!
వసంతకవస్తే-బుద్ధి భ్రమిస్తుందట, చిత్తమున్మత్త మవుతుందట!
వసంతంవస్తే-అహంకారం విహంగమౌతుందట !
కవులుకన్న కమ్మకమ్మని కలలవి కవులువిన్న తియ్యతియ్యని కతలవి
కవులుకట్టిన కమనీయకవిత లవి కవులు గీసిన కమ్రచిత్రలేఖ అవి!

* * * *

కాలం కొలది వానిరంగు పొలిపోతున్నది
కాలంకొలది వాని ఇంద్రజాలం తేలిపోతున్నది
కాలంకొలది వానిని కని వినే దాతలు కరవై పోతున్నారు
కాలంకొలది వానిలోని వేడీ వాడీ కరగి సురిగిపోతున్నది!
ప్రకృతినిచూచి పులకించే పురసత్తులేదు మనిషికి
ప్రకృతి నారాధించే మునుపటి పెరిమలేదు మషికి
ప్రకృతిలో కలగలిసిపోయే వెర వతను మరచిపోయాడు
ప్రకృతితో పయనించే తెరవు తప్పిపోయాడతడు
తన ఎడదలో మతాబాలు వెలగడం లేదు
తన కడుపులో షఢ్రుచులు పలకడం లేదు
తన కనులలో వెలుపులు కులకడం లేదు
తన వెన్నుపూసలో విద్యుత్తు తళుక్కుమనడంలేదు!
తన లోకం భయసందేహాలతో తన్నుకుంటున్నది
తన కాలం యుద్ధవ్యాఘ్రం మీసలు పట్టుకొని ఉయ్యేల లూగుతున్నది
తనతరం అణ్వస్త్రాగ్నితో చెరలాట మాడుతున్నది
తనబ్రదుకు రాచరికాల సుడిగాలిలో విడియాత్రై పోయినది
అతను కోరుతున్నది మానవహృదయంలో అపారకరుణ పల్లవించాలని
అతను వాంఛించేది మానవ వ్యవహారాలలో అనంతప్రేమ పుష్పించాలని
అత నభిలషించేది మానవ సంఘంలో అఖండ సమతా గంధం గుబాళించాలని
అతనాకాంక్షించేది మానవక్షీర సముద్రంలో అమేయ స్వేచ్ఛా సుధవెలికి తొలకాలని

అతను అల్జీరియాలో ఆహుతి అవుతున్నదందులకే
అతను అంగోలాలో స్వాహా అవుతున్న దందుకే
అతను దక్షిణాఫ్రికాలో దగ్ధ మవుతున్న దందుకే
అతను ఖండఖండాంతరాలలో అలవరించి ఆకులు
మేస్తున్నదందుకే

ప్లవను పట్టుకొని కష్టసముద్రం దాటాలనుకున్నాడు
ప్లవను పట్టుకొని యుద్ధసాగరంనుంచి బయటపడాలను
కున్నాడు
ప్లవను పట్టుకొని అణ్వస్త్రనీరనిధికి నెమ్మదిగా దూరం
కావాలనుకున్నాడు
ప్లవను పట్టుకొని ప్రపంచ శాంతిదేవి సన్నిధికి పయనించా
లనుకున్నాడు.

ప్లవ కదలిపోయినా తీరం ప్రత్యక్షం కాలేదు
ప్లవ అంతమైనా సముద్రగర్భం దవుదవ్వుల కేగలేదు
ప్లవ ముగిసినా శాంతి ద్వీపం ప్రతిబింబమైనా కానరాలేదు
ప్లవ పోయినా స్వేచ్ఛా సమతల పల్లవ దర్శనమైనా కాలేదు.

శుభకృత్తులలో అతను శుభం పొందాలనుకుంటున్నాడు;
శాంతిని చూరగొనాలనుకుంటున్నాడు
శుభకృతులో స్వేచ్ఛాసమతల సుఖపరిష్వంగం
తప్పదనుకుంటున్నాడు,
మానవతావని సుందరవసంతంలో తులతూగించాలనుకుంటున్నాడు

ప్రతీక్షతోనే అతసి
ఉగాదిముందు నిల్చున్నాడు
ఆ నిరీక్షతోనే అతనీ
ఉగాది నాహ్వానిస్తున్నాడు
ఆ ఆశతోనే అతనీ
ఉగాదికి నివాళి పడుతున్నాడు
ఆ ఆశయంతోనే అతనీ
ఉగాదిని చేసుకొంటున్నాడు!
రా రమ్మ రమ్మో ఉగాదీ!
తీరమ్ము చేర్చుము యుగాదీ!
రారా ఉగాదీ! రా ఉగాదీ! రా!!

—విద్వాన్ విశ్వం

అరువదాకులుగల చక్రమపుడె తిరిగి
తరలివచ్చితె కాలరథమ్ముపైని
స్వాగతము నీకు శుభకృతు స్వాగతమ్మ
జగదనంత శుభాకాంక్షి స్వాగతమ్మ.

కెంపులు వజ్రముల్ కీలించినట్టుల కొమ్మలలంకృతుల్ నెమ్మి
నిలుప
ఆసవమ్మాని నవ్యావేశ హృదయాల నళులు సంస్తుతి
గీతులాలపింప
చివురుమేతల గొంతుకూడి పికమ్మ లమృతగానము దిక్కులందు
నింప
విమలపథంబుల సుమగంధములచిమ్మి మలయానిలుడు
వీవనలు కదల్ప

సకలమంగళవస్తు సంచయముతోడ
స్వాగతోత్సవ విభవముల్ సంతరించి
ఎడదలో పొంగు మోముపై గడలుకొనగ
తీర్చె ఋతురాజు నీరాక తెరువునందు

జీవితమందు శుష్కమయి జీర్ణమునైనవి రాలిపోవ వా
పోవు జగత్తునంత పరిఫుల్లమొనర్చు వసంతవేళ గ్రొం
బూవు పెడంద చిర్నగవు పొల్పుల నెన్నియొ దాచిదాచి నీ
వేవి శుభాలు తెచ్చితివి, యేదైర విప్పుమ నూతనాబ్దమా.

నీకు నివాళులెత్తితిమి నిండుమనంబుల హర్షదీపికల్
నీ కనుదోయివెల్గు లెదనిండుగ నింబసుమంపు భక్ష్యముల్
నీకయికూర్చిపెట్టితిమి నీవరుదెంచుటె మాకు పండువై
కోకలు క్రొత్తగట్టితిమి కోరిక లీరిక లెత్తు స్వాంతముల్.

ప్రకృతి శక్తులగూడి ప్రసవించు బంగారు, ప్రాణికోటుల మూపు
భాగ్యదోల
ప్రాక్పశ్చిమదిశా శివంకరభావనన్ వసుధ కేకకుటుంబ భవన
మెసగు
సంస్కృతీ నందన సౌందర్యవనమందు నానంద సంపద లబ్బ
ననుచు
స్నిగ్ధహృదయరాగ దుగ్ధవారాశిలో పూర్ణజీవిత లక్ష్మి పుట్టవచ్చు
ఘనతరాంతరయాన సంఘాతలోక బాంధవంబున స్వర్గమై భవము
పొడము
పుడమినికమీద నను నాశ పొంగు మాదు శీర్షములజల్లరావె
ఆశిస్సుమాలు.

—కందుకూరి రామభద్రరావు

[రెండవ పుట తరువాయి]

లన్నిటినీ వీరేశలింగంగారు విని యోగించారు.

### వితంతు వివాహాలు

ఆ కాలంలో ముక్కుపచ్చ లారని పసికూనలని ముదుకాళ్ళ ముదుసళ్ళకి కట్టబెట్టేవారు. చిన్న తనంలోనే వైధవ్యం ప్రాప్తిస్తే తమ దోషమేమీ లేదన్నట్లు తల్లి దండ్రులు భారమంతా విధినెత్తిన వేసేవారు. పసుపు కుంకుమలకు దూరమై, చదువు సంగీతాలకు నోచుకోక, జీవితానందానికి వెలియై నిస్సహాయంగా బ్రతుకులు వెళ్ళదీసే అభాగినుల దుస్థితిని చూసి వీరేశలింగంగారి హృదయం ద్రవించిపోయింది. ఆయనకి సంతానంలేదు. కాని తెలుగు నేలలోని అభాగినులందరూ తన సంతాన మైనట్లుగా ఆ మహనీయుని హృదయం ఆక్రోశించింది. 1879 లో వివేకవర్ధనిలో అనాథ స్త్రీలని గురించి గుండెలు జలదరించే వ్యాసం వ్రాశారు. చిన్నప్పుడే సౌభాగ్యానికి దూరమైన స్త్రీలు పునర్వివాహం చేసుకోటం న్యాయమనీ, ధర్మశాస్త్ర సమ్మతమనీ నిరూపించి ప్రచారంచేశారు. తమ చేతులమీదుగా వీరేశలింగంగారు వితంతువులకు వివాహాలు జరిపించి నవజీవన సౌభాగ్యం చేకూర్చి మార్గదర్శకులైనారు.

సత్యబలమూ, ధర్మబలమూ, దైవబలమూ ఆయనకి బాసట లైనాయి. ఆనాటి ప్రగతిశీలురైన విద్యార్థు లెందరో వీరేశలింగం గారికి అండగానిలిచి ఆయన ఉద్యమాలకి అఖండ విజయాన్ని సాధించారు.

### వసుచరిత్ర

సంఘసేవతోపాటు సాహిత్య సేవకూడా పంతులుగారు నిర్విఘ్నంగా కొనసాగించారు. చిన్నప్పటినుంచీ ఆంధ్ర సంస్కృత సాహిత్యాలు ఎంతో శ్రద్ధగా అధ్యయనం చేశారు. చిన్నప్పుడే వసుచరిత్ర చదవాలని ఆయనకి కోరిక కలిగింది. పుస్తకం ఖరీదు నాలుగున్నర. పాఠ్యగ్రంథం కాదు పైగా. అందుకని తల్లి కొని ఇవ్వలేదు నెలకి ఎనిమిది అణాలు ఇస్తానని పుస్తకం ఇమ్మనీ దుకాణదారుని అడిగాడు. అతడు పుస్తకం ధర పూర్తిగా ఇచ్చేవరకూ రోజూ షాపుకివచ్చి పుస్తకం చదువుకోవచ్చునని అన్నాడు. తీరిక దొరకగానే పుస్తకాల దుకాణానికి వెళ్ళి వసుచరిత్ర చదువుతూ తన్మయుడవుతూ వుండేవాడు. కొన్నాళ్ళ తరువాత ఈ సంగతి తల్లికి తెలిసి వసుచరిత్ర కొని కొడుకుకిబహూకరించింది. అంతటి మక్కువతో సాహిత్యం అభ్యసించి భాషా పాటవమూ వ్యాకరణ పరిజ్ఞానమూ సంపాదించాడు.

ఆనాటి పండితులకి దీటువచ్చే ప్రౌఢిమని అలవరుచుకున్నారు వీరేశలింగంగారు. ఆయన పాండిత్య ప్రకర్షకి నిదర్శనాలుగా శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచనోత్తర రామాయణమూ, నీతిచంద్రిక లోని సంధి, విగ్రహాలూ వెలువడినాయి. కౌమారప్రాయంలోనే ప్రౌఢమైన ప్రబంధం రచించారు.

### గ్రంథకర్త

కాని సంఘ సంస్కరణోద్యమాలవల్ల సామాన్య జనులకి చేరువగా వచ్చారు. కేవలం పాండిత్య ప్రకర్షణకోసం సాహిత్య సృష్టి చేయటం నిష్ఫలమని ఆయన గ్రహించారు. సాధారణ మానవుల ఆశయావేశాలనీ సుఖదుఃఖాలనీ మణిదర్పణంలాగా ప్రతిబింబించగల సరళమైన జనరంజకమైన సాహిత్యప్రక్రియలకి ఆయన అంకురార్పణ చేశారు. తెలుగులో మొదటి నవలని వెలువరించారు. లేనిపోని పరువు ప్రతిష్ఠలని నిలబెట్టుకోటంకోసం ఎగరలేని ఎత్తులకివెళ్ళి తన సంసారాన్ని అగచాట్లపాలు చేసుకున్న రాజశేఖరుడి పాత్రని కల్పించారు. ఆనాటి సమాజంలో వున్న మోసగాళ్ళనీ దుర్మార్గులనీ రాజశేఖర చరిత్రలో కళ్ళముందు కదిలేట్లు వర్ణించారు. సత్యరాజు అనే యువకుని సాహస యాత్రలు వర్ణిస్తూ "సత్యరాజు పూర్వదేశ యాత్రలు" రచించారు. తమ స్వీయచరిత్ర రచించి, తెలుగులో ఆత్మకథలకి శ్రీకారం చుట్టారు. పడుచు పెళ్ళాలని చేసుకున్న ముసలివాళ్ళనీ, ఛాందసాచారపరాయణులనీ, అభివృద్ధి నిరోధకులనీ తమ ప్రహసనాలతో ఎదుర్కొన్నారు. హాస్యాన్ని పదునైన ఆయుధంగా ప్రయోగించి సమాజంలోని దుష్టశక్తులని చీల్చి చెండాడారు. ఆయన సృష్టించిన సత్యవతి పాత్ర ఎందరికో అభిమాన పాత్రమయింది. తమ పిల్లలకి సత్యవతి అని పేరుపెట్టుకున్న తండ్రులెందరో వున్నారట. అపూర్వ యాత్రలుచేసిన సత్యరాజు చిరునామా తెలపవలసిందని పాఠకులు చాలామంది పంతులుగారికి ఉత్తరాలు రాశారుట. ఊపిరి సలపని కార్యక్రమాలలో మునిగి తేలుతున్నప్పటికీ తీరిక దొరికినప్పుడల్లా తాళపత్ర గ్రంథాలు పరిశోధించి ఆంధ్రకవుల చరిత్ర లెన్నిటినో వెలుగులోకి తెచ్చారు. సారస్వత విమర్శనలో చరిత్రాంశాల పరిశోధనలో ఈ

గ్రంథం భావితరాలవారికి మార్గ దర్శకమయింది.

## సరళ ధోరణి

వచన రచనలో సౌలభ్యాన్ని స్పష్టతనీ సాధించి వివిధ విష యాలని గురించి వ్యాసాలు వ్రాశారు. ప్రచారాత్మకమైన సాహిత్యాన్ని కూడా విరివిగా సృష్టి చేశారు. స్త్రీలకి అందుబాటులో వుండాలనే లక్ష్యంతో విజ్ఞాన బోధకాలైన పుస్తకాలెన్నో రాశారు. విద్యావ్యాప్తికి దోహదం కలిగించాలనే పవిత్రాశయంతో వీరేశలింగంగారు వాచక పుస్తకాలు రచించారు. శాస్త్రవిషయాలని బోధించే పుస్తకాలని కూడా రాసి దారి చూపించారు. శరీర శాస్త్రం, భౌతికశాస్త్రంవంటి విషయాలని బోధించే పుస్తకాలు రాసి వైజ్ఞానిక విషయాలని సుబోధకంగా ప్రచారముచేసే మార్గం చూపించారు. సాంఘిక రంగంలోనే కాక సాహిత్య ప్రపంచంలోకూడా ఆయన అగ్రగామి; మార్గదర్శి. గద్యవాఙ్మయ బ్రహ్మ అనే బిరుదుని సార్థకం చేసిన సామర్థ్యం, వైవిధ్యం ఆయన రచనల్లో కనిపిస్తాయి. వ్యాకరణ యుక్తమైన వచనశైలి అయినప్పటికీ చేవ, జీవమూ, జవమూ తొణికిసలాడుతూ వ్యావహారిక శైలికి దగ్గరగా వుండే వచనాన్ని ఆయన రచించారు. విషయాలని సులువుగా అందించే ఉద్దేశంతో సరళమైన ధోరణిలో రచన సాగించారు. భావసంపదతో, శబ్దసౌష్ఠవంతో వస్తుగౌరవంతో అలరారే ఆంగ్ల వచన రచనా విన్యాసం వీరేశలింగంగారి శైలిలో తొంగి చూస్తూ వుంటుంది.

## అనువాదాలు

షేక్స్పియర్ మహాకవి భావాలని తెలుగువారికి అందించాలనే ఆశయంతో వెనిస్ వర్తకుడి నాటకాన్ని తెనిగించారు. అనువాదంలో కూడా వీరేశలింగంగారి నైపుణ్యం అద్వితీయం: ఎందరో అభిజ్ఞాన శాకుంతలాన్ని ఆంధ్రీకరించారు. కాని పంతులుగారి అనువాదంలో కాళిదాసు హృదయమే స్పందిస్తున్నట్లనిపిస్తుంది. నాటకారంభంలో మూలంలో "నఖలునఖలుబాణః" అని వుంటే, "వలదువలదు బాణ" మంటూ ఎత్తుకోటంలో ఆయన ప్రత్యేకత కనిపిస్తుంది. మూలంలోనిసౌందర్యాన్ని వీరేశలింగంగారి శాకుంతల నాటకానువాదం ప్రతిబింబించినంతగా ఇతర అనువాదాలలో పొడగట్టదు. అందుకే వీరి అనువాదానికి అంతటి ఆదరణా ప్రఖ్యాతీ లభించాయి.

## మళ్ళీ అవతరించాలి

ఆయన ఏ మార్గంలో అడుగు పెట్టినా నిబ్బరంగా ముందుకి సాగిపోగలిగిన సాహసి. ఒంటరిగా తను నడిచివెళ్ళినా, అడుగు జాడల్లో ఆంధ్రదేశమంతా వెంట వస్తుందని ఆయన ఊహించారో లేదో? ఆ మహనీయుడు చూపిన వెలుగుబాటలో ముందుకి సాగుతూ మన కృతజ్ఞతా భావాన్ని ప్రకటించుకోవాలి. "దీక్ష రథమున్ మరల్పక, కళాక్షేత్రమ్ము చూపించు ధార్మిక వేదండుని ఉక్కు గుండెలు మహేంద్రీ! మాకు ఆదర్శముల్" అంటూ అంతటి మహనీయుని ప్రసవించిన ఆంధ్రజననికి నీరాజనాలు అందించాలి. సమాజంలో అవినీతి వెర్రి తలలు వేస్తున్న ఈ తరుణంలో వరకట్నాలు ఆకాశాన్నంటుతూ వివాహాలు వ్యాపారంగా పరిణమించిన ఈ సమయంలో అధర్మంతో దేశం అస్తవ్యస్తమై పోతున్న ఈ దినాలలో వీరేశలింగంగారు మళ్ళీ అవతరిస్తే ఎంత బాగుండును అనిపిస్తుంది.

---



'లాగరా...... హైలెస్సా'

చిత్రకారుడు: బి. వి. రమణమూర్తి




## అఖిల భారత కదంబ కార్యక్రమము

జూన్ 16-వ తేదీ శనివారం నుండి జూన్ 30-వ తేదీ శనివారం వరకు

(జూన్ 17, 24 ఆదివారములు మినహా)

**ఉ॥ ప్రసారము I**

49.67 మీ (6040 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

7-00 అరుణోదయ సంగీతమంజరి
7-30 వందన్‌వార్ భక్తి గీతావళి
8-00 ఝుంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్‌సంగమ్ కదంబ కార్యక్రమం
8-30 మధువన్
8-57 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరణ
9-00 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము II**

31.41 మీ (9550 కిలోసై)
41.32 మీ (7260) కిలోసై

11-00 ఇంద్రధనుస్సు కదంబ కార్యక్రమము
12-00 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము III**

31.41 మీ (9550 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము IV**

41.93 మీ (7155 కిలోసై)

**కర్ణాటక సంగీత కార్యక్రమము**

4-30 గీతమాలిక
4-45 అంజలి-గీతావళి
5-00 వాద్య సంగీత్
5-15 మధురగీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 గానామృత్ శాస్త్రీయ సంగీతం
6-15 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము V**

48.78 మీ (6150 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

6-30 తార్‌హార్ ప్రసిద్ధ పురాతన గీతాలు
6-45 ఉదయగాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావళి మీరు మెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
8-10 రస్‌వంతి సుగం సంగీతం మీరుకోరినవి (బుధవారములు)
8-30 మన్-చాహే గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరణ (శనివారములు మినహా)
9-45 ప్రసార సమాప్తి

**ప్రత్యేక కార్యక్రమము**

జూన్ 16, 23, 30 శనివారాలు

రా॥ 9-45 నుండి 11-00 వరకు
50.38 మీ (5955 కిలోసై)
10-00 నుండి 11-00 వరకు
49.30 మీ (6085 కిలోసై)

9-45 నాదరంజని వాద్య సంగీతం
10-00 గీతమంజరి లలిత సంగీతం
10-40 రంగవాణి లలిత శాస్త్రీయ సంగీతం
10-57 ఝరోఖా వచ్చేవారపు కార్యక్రమాల వివరాలు
11-00 ప్రసార సమాప్తి

జూన్ 17, 24 ఆదివారాలు
ముఖ్యమైన పండుగ దినాలు

**ఉ॥ ప్రసారము I**

49.67 మీ (6040 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

7-00 అరుణోదయ సంగీతమంజరి
7-30 వందన్‌వార్ భక్తి గీతాలు
8-00 ఝుంకార్ వాద్య సంగీతం
8-15 స్వర్‌సంగమ్ కదంబ కార్యక్రమము
8-30 గీతోంభరీ కహానీ పాటలతో కూర్చిన కథ
8-57 ఝరోఖా నేటి కార్యక్రమముల వివరణ
9-00 ప్రసార సమాప్తి

**ప్రసారము II**

31.41 మీ (9550 కిలోసై)
41.31 మీ (7260 కిలోసై)

10-15 రంగావళి
10-45 రత్నాకర్ నాటికలు, హాస్యరచనలు, కథలు
11-00 బాగ్‌బహార్
11-30 చౌవరా మాటలు, పాటలు
12-00 ప్రసార సమాప్తి

**మ॥ ప్రసారము III**

31.41 మీ (9550 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

2-00 మనోరంజన్ మీరుకోరిన పాటలు
3-00 అప్నాఘర్ మీ ఇంట్లో అందరికీ
3-30 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము IV**

41.93 మీ (7155 కిలోసై)

**కర్ణాటక సంగీత కార్యక్రమము**

4-30 గీత మాలిక
4-45 అంజలి-గీతావళి
5-00 వాద్య సంగీత్
5-15 మధుర గీతం మీరుకోరిన పాటలు (బుధ, శుక్ర, ఆదివారములు)
6-00 గానామృత్ శాస్త్రీయ సంగీతం
6-15 ప్రసార సమాప్తి

**సా॥ ప్రసారము V**

48.78 మీ (6150 కిలోసై)
41.32 మీ (7260 కిలోసై)

6-30 తార్‌హార్ ప్రసిద్ధ పురాతన పాటలు
6-45 ఉదయ్‌గాన్ దేశభక్తి గీతాలు, బృందగానము
7-00 పుష్పావళి మీరు మెచ్చిన పాటలు
7-30 గజరా గీతికా గుచ్ఛము
8-00 పత్రావళి శ్రోతల ఉత్తరాలు
8-10 రస్‌వంతి సుగమ్ సంగీత్
8-30 మన్-చాహే-గీత్ మీరుకోరిన పాటలు
9-00 హవామహల్ నాటికలు, రూపకములు, హాస్య రచనలు
9-15 మంజూషా జానపద, ప్రాంతీయ సంగీతం
9-30 రాగ్‌రంగ్
9-42 ఝరోఖా రేపటి కార్యక్రమముల వివరణ
9-45 ప్రసార సమాప్తి

ఇతరవివరములకు: ప్రొడ్యూసర్, 'వివిధభారతి' ఆకాశవాణి, పోస్ట్‌బాక్స్ 4, బొంబాయి-1.

VANI-Printed at the Royal Printing Works, Madras-2-Edited and Published by the Station Director, All India Radio, Madras-4.



సి. ఆర్. నరసింహన్: ప్రసంగం (తమిళము)
(మద్రాస్, జూన్ 18)



టి. కె. రంగాచారి
(బెంగుళూర్, జూన్ 18)



'శంకర్' : రచన—సంజీవిపర్వతం నాటిక
(మద్రాస్, జూన్ 16)



బూదలూర్ కృష్ణమూర్తిశాస్త్రి: గోటువాద్యం (మద్రాస్, జూన్ 18)



విజయవాడ కేంద్రంలో పిల్లల కార్యక్రమంలో పాతమెంబర్ల
దినోత్సవసందర్భంలో పాల్గొనినవారు



ఈ సందర్భంలో జరిగిన 'రాఫల్'(raffle)లో

# అఖిలభారత సంగీత కార్యక్రమము



వినాయక్‌రావ్ పట్వర్ధన్ (జూన్ 30)



ఎమ్. డి. రామనాథన్ (జూన్ 23)



గజానన్‌రావ్ జోషీ: వయొలిన్ (జూన్ 1



సంధ్యావందనం శ్రీనివాసరావు
గం, తానం, పల్లవి (మద్రాస్, జూన్ 28).



పి. ఎస్. రామస్వామి
ఆంగ్ల ప్రసంగము
(మద్రాస్, జూన్ 28)






ఎవ్. వి. అరుర్: ఇటీవల మద్రాస్‌లో జరిగిన హాకీ ఆటల పోటీపై రేడియో సమీక్ష చేసిరి.



ఫాదర్ బాలమ్: ఆంగ్ల ప్రసంగము
(మద్రాస్, జూన్ 21)



ఎన్. రాధాకృష్ణ నాయుడు: క్లారినెట్
(మద్రాస్, జూన్ 28)